శ్రీః

# అద్వైతామృతమ్
# వేదాంతనిశ్చయః

శ్రీ బెల్లంకొండ రామరాయకవి
(1875-1914)

ఆంధ్రానువాదము
మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి
శ్రీ గోరంట్ల వెంకన్న సంస్కృత కళాశాల,
తిమ్మసముద్రము



ప్రకాశకులు
సాధన గ్రంథ మండలి, తెనాలి

వెల : రూ. 25/-

శ్రీః

# అద్వైతామృతమ్
# వేదాంతనిశ్చయః

శ్రీ బెల్లంకొండ రామరాయకవి
(1875-1914)

ఆంధ్రానువాదము
మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి
శ్రీ గోరంట్ల వెంకన్న సంస్కృత కళాశాల,
తిమ్మసముద్రము



ప్రకాశకులు
సాధన గ్రంథ మండలి, తెనాలి

వెల : రూ. 25/-

# అద్వైతామృతమ్ - వేదాంతనిశ్చయః

శ్రీ బెల్లంకొండ రామరాయకవి, (1875-1914)

ఆంధ్రానువాదము

మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి

ప్రథమ ముద్రణ:- చిత్రభాను 27-12-2002
(శ్రీ బెల్లంకొండ రామరాయకవి జయంతి)

ప్రతులు : 1000
పేజీలు : 96
వెల రూ. : 25-00


4-103, ILTD Colony Extn., Kothapet, CHIRALA - 523 157.
Phone : 08594-34054.

ప్రతులకు :

1. సాధన గ్రంథమండలి, తెనాలి-522 201
2. బెల్లంకొండరామకోటేశ్వరరావు, పమిడిపాడు (వయా) నర్సరావుపేట, గుంటూరు జిల్లా



DTP by
VIKRAM GRAPHICS
Opp. M.R.O. Office
CHIRALA - 523 155
Ph.: 08594 - 37658

Printed at :
**KAMAL ART PRINTERS**
TENALI.

శ్రీః

# పీఠిక

# మాధృజ్మందారము

శ్రీ బెల్లంకొండ రామారావు గారి గ్రంథములను అనువదించుచు అందుకు కావలసిన విషయములు ముందుగా వివరింపనిచో విషయ గ్రహణ సులభము కాదని భావించి యీ పుస్తకములకు ఈ పీఠికను అమర్చితిని. దీనిని చదివిన తరువాత గ్రంథములలోనికి పోవలసినదిగా నావంటి వారికి విజ్ఞప్తి. ఈ గ్రంథ నిర్మాణము చేయించిన శ్రీ రావి మోహనరావుగార్కి, గ్రంథ సహకార మందించిన శ్రీ ముళ్లపూడి విశ్వనాథశాస్త్రిగార్కి కృతజ్ఞతాంజలులు.

బ్రహ్మము : జ్ఞానమే బ్రహ్మము. సత్యమే బ్రహ్మము. ఆనందమే బ్రహ్మము. వెఱసి సచ్చిదానంద స్వరూపమే బ్రహ్మము. ఇందులో 'సత్ చిత్ ఆనంద' అనునవి పర్యాయపదములవంటివి. బ్రహ్మము శాంతము. అనగా ఎట్టి బేధములు, విక్షేపములు లేనిది. నిర్విశేషము. ప్రధానముగా బ్రహ్మమును జ్ఞానమనియే చెప్పవలయును. దానికి 'దృక్' అనియు, శుద్ధచైతన్యమనియు పేరు. పరమార్థ దశలో 'శుద్ధ బ్రహ్మము' అందురు.

బ్రహ్మము తప్ప వేఱే పదార్థము లేదు కనుక 'ఉన్నది' అనబడు మాయయు, మాయాజన్యమయిన ప్రపంచమున్ను మిథ్య కనుక బ్రహ్మయందే భ్రాంతి రూపమున కల్పింపబడినవి కనుక 'బ్రహ్మమే' సత్యము.

బ్రహ్మము 'జ్ఞాత' అనగా తెలిసికొనువాడు కాదు. అనగా తెలిసికొనుటకు బ్రహ్మము తప్ప ఏమియూ లేదు. 'జ్ఞేయము' అనగా తెలిసికొన దగినది ఉన్నచో, 'జ్ఞాత' అనగా తెలిసికొనువాడు మఱొకడు ఉండును. జ్ఞేయము లేదు. జ్ఞాతయు లేదు. కాగా మిగిలినది జ్ఞానమే. అదే 'చిత్తు' అని 'చైతన్యము' అని చెప్పబడును.

అయితే 'బ్రహ్మ సర్వజ్ఞము' అనుటకు కారణము ప్రపంచ స్రష్టగా అయిన 'ఈశ్వర' దశను బట్టి వచ్చినది. ఆ ఈశ్వరుదు బ్రహ్మ ప్రతిబింబమే కనుక 'సర్వజ్ఞుదు, ఈశ్వరుదు, సర్వజ్ఞము బ్రహ్మము' అని వ్యవహారము వచ్చినది.

సచ్చిదానంద నిర్వచనము :

సత్ - సర్వ విషయములు బ్రహ్మయందే కల్పింపబడినవి. బ్రహ్మము జగత్తు అను చిత్రమునకు గోడ వంటిది. టి.వి. తెఱ వంటిది. అధిష్ఠానము అనగా ఆధారము. కనుక పరమాత్మయే వాస్తవముగా ఉన్నది. 'సత్' అనగా సత్యమయినది. ఉదా॥ 'ఘటము' అనగా అచ్చట ఉన్న 'బ్రహ్మము' నందే 'ఘటము' అను వ్యవహారము కల్పితము. అచ్చట మామూలుగా చూచినను 'ఘటము' అనుచోట దానికి ఉపాదానకారణమయిన 'మట్టి' ఉన్నది గదా! మట్టి వలన గదా ఘటమునకు అస్తిత్వము. తాత్విక దృష్టితో చూచినచో 'మట్టి' గూడ లేదు. అచ్చట ఉన్నది సర్వవ్యాపి అయిన బ్రహ్మమే. 'మట్టి' అను మాయకు అధారమయిన బ్రహ్మము మాత్రమే 'సత్తు'. అనగా మాయ మట్టిని బ్రహ్మమ:నందే కల్పించినది. ఆ మట్టి యందు మనము 'కుండ' అను అకారమును కల్పించితిమి. కాగా ఘటముగా మనకు కనబడినది బ్రహ్మమే.

ఇలా ఘట, పట మొదలైన పదార్థములందు సామాన్యంగా (Common గా) వ్యాపించినది బ్రహ్మమే. కనుక 'అది ఉన్నది, ఇది ఉన్నది, వాడున్నాడు' మొదలగు విషయములలో 'అది, ఇది, వాడు' మొదలగు భిన్నవిషయములను తొలగింపగా మిగిలిన 'ఉన్నది' అను 'సత్త' (సత్) బ్రహ్మమే.

పైగా '3' కాలములందు, అన్నియుగములందు 'నేను, నేను' అను అనుభవములో, 'ఆత్మ' కనబడుచునేయున్నది. కనుక 'ఆత్మ, సత్తు' త్రికాలము లందు సత్యమే.

చిత్తు:-

అనగా జ్ఞానము. చైతన్యము. దృక్. తనను తానే తెలియజేసికొనుచు ఇతరమును తెలియజేయునది జ్ఞానము. ఉదాహరణ-దీపము, సూర్యుడు. ఇవి తమను తామే వెలిగించుకొనుచు ఇతర పదార్థములను వెలిగింపజేయును.

మనకు మన శరీరము యొక్క 'లోపలి, బయటి' విషయములు 'ఆత్మ' వలననే తెలియుచున్నవి. మన మనస్సు అంతఃకరణము, అంతఃకరణ వృత్తులు అనగా మనో వ్యాపారములు అన్నియు 'ఆత్మ' వలననే తెలియుచున్నవి. మన ధ్యాస అక్కడలేనిచో దృశ్యములు, శ్రవ్యములు మనకు తెలియవు. అట్లే

సుషుప్తియందు, సమాధియందు మనకు అంతఃకరణము మొదలగు ఆలోచనా యంత్రములు పనిచేయవు. అపుడు 'ఆత్మ' ఒక్కటే 'సాక్షి' గా నిలుచును.

సుషుప్తి అనగా గాఢనిద్రలోని సుఖమును తెలిసికొను శక్తి ఒక్క అత్మకే గలదు. 'అత్మ' కయినను 'అంతఃకరణము' సాధనముగా ఉపయోగపడదు. కనుక అపుడు కలిగిన 'సుఖమునకు' సాక్షి అయి 'అత్మ' యే నిలుచును. కనుకనే మేల్కొనిన తర్వాత 'అ సుఖము', అ 'అజ్ఞానము' (ఒళ్లెఱుగని నిద్ర) వ్యక్తి అనుభవములోనికి వచ్చును. కనుక 'అత్మ' యే జ్ఞానము.

ఆనందము:- నిత్య నిరుపాధిక నిరతిశయానందము

1) నిత్యము:- అనగా శాశ్వతమయినది. ఏకరూపములో ఇది అనుభవములోనికి వచ్చును. ఈ అనందము జీవికి నిత్యముగానున్నదే. అయితే స్వప్నదశలోను 'జాగ్రద్దశ' లోను దీనికి విక్షేపము కల్గినట్లు, వస్తువుల వలన ఈ యానందము కల్గినట్లు అనిపించును. నిజమునకు అ '2' దశలలో కలుగు ఆనందమయినను అక్షణమున ఇంద్రియ వ్యాపారములు అగుట వలన 'అత్మ' సుఖమే. కాని 'అత్మ సుఖము' గా దీనిని భావింపలేము. వస్తువుల యొక్క అధిష్ఠానము బ్రహ్మమే కనుక ఈ అనందము బ్రహ్మమే అని భావింపవలయును.

2) నిరుపాధికము అనగా ఎట్టి కారణము లేక వచ్చు ఆనందము. లోకములోని ఆనందములు ఏదో ఒక వస్తువు వలన వచ్చును. కాని సుషుప్తి, సమాధి మొదలగు వానిలో అనందమునకు నిమిత్తము లేదు. పైగా ఈ యానందము సర్వజీవులకు ఒకేరకముగానుండును. కనుక అది నిరుపాధికము. దీనియందు పందు ఉద్యోగము, సినిమా, స్త్రీ,పురుషుడు మొదలగు కారణములు లేవు. సహజమయినది యిది.

3) నిరతిశయము:- అనగా ఈ ఆనందమునకు మించిన అనందము ఏదియును లేదు. కనుకనే క్రొత్తకాపురపు దంపతులయినను తమ శృంగారమును విడిచి 'నిద్రకు' ఉపక్రమింపక తప్పదు. 'సుషుప్తి' లోని ఆనందము అటువంటిది.

4) అఖండము:- 'సత్' వద్ద చెప్పినట్లు అన్ని విషయములందు అనుస్యూతముగా (Continuous) వచ్చుచున్న 'ఉనికి' అఖండమని చెప్పదగును. 'అత్మ' యొక్క అస్తిత్వమునకు 'దేశకాల వస్తువుల' వలన భంగము లేదు.

అకాశము సర్వవ్యాపియే. కాని 'కాలము' అనగా ప్రళయముచేత అది భంగమగును. మఱల సృష్టికాలమున అది ప్రారంభమగును. కాలముగూడా అఖండము కాదు. అది అకాశము కాదు కనుక. అనగా అకాశము వేఱు కాలము వేఱు కనుక కాలము అఖండము కాదు. ఇది వస్తుభేదము. కాని 'అత్మ' సర్వవ్యాపి.

అన్ని వస్తువులకు అదే అధిష్ఠానము. ఈ వస్తువులన్నియు ఆకాశ కాలములు సైతము – మిథ్యలే. కనుక ఆత్మ సర్వవ్యాపి. అఖండము.

మామూలుగా వస్తువులమధ్య స్వగత భేదము ఉండును. అట్లు 'ఆత్మ'లో భేదముండదు. ఉదాహరణకు చెట్టులో స్వగత భేదము కలదు. కాండము, కొమ్మలు, ఆకులు, పూలు, కాయలు – ఇలా. ఆత్మయందు స్వగత భేదములు లేవు. ఆకాశమువలె అఖండమే. ఆత్మయందున్న 'సచ్చిదానందరూప' లక్షణము వేఱువేఱు గుణములు కావు. అవి అన్నియు కలిసి అఖండ ధర్మములు పైగా అవియును బ్రహ్మము పై కల్పితములు.

వివరణ:– అగ్నికి 'లోహిత, ఉష్ణ, ప్రకాశములు' పరస్పరము భిన్నమయిన ధర్మములు కావు. అట్లే 'సచ్చిదానందములు' బ్రహ్మకు భిన్నమయిన ధర్మములు కావు. 'సత్తు' అనగా ఉన్నది అని అర్థము. ఏదయినా ఒక పదార్థము 'ఉన్నది' అని తోచుటకు ఇతర పదార్థముల సహాయము అనగా దీపము, నేత్రము మొదలగువాని సహాయము అవసరము. కాని 'ఆత్మ' అస్తిత్వమునకు 'ఆత్మ'యే ప్రమాణము తప్ప వేఱొక ప్రమాణము లేదు. కనుక 'ఆత్మ' తనను తానే తెలియజేసికొనును. అందుచేత అది 'జ్ఞానము' అనగా చిత్. కాగా 'సత్తే చిత్తు' అయినది.

తనను తాను పొందుటయే అత్యంత సుఖము. ఇది సుషుప్తియందు ఏకరూపముగానున్నది. కనుక 'సత్తు' ఇది తనను తానే తెలియజేసికొనుచున్నది. పైగా 'నిద్రలో నాకు ఒళ్లు తెలియలేదు' అను అజ్ఞానమును గూడా ఇదే తెలియజేయుచున్నది. కనుక 'తనను అనగా సుఖమును, అజ్ఞానమును' గూడా తెలియజేయుచున్నది. కనుక 'సుఖమే' చిత్తు. చిత్తే సత్తు, సత్తే చిత్తు అగుచున్నది.

ఈ సుఖమే అతి గొప్పది (నిరతిశయము – వద్ద చూడుము) కనుక ఆనందము. కనుక 'సచ్చిదానంద' లక్షణముల వలన ఒక్క బ్రహ్మమే చెప్పబడినది. అందునను 'సత్తు చిత్తు' అదే ఆనందము. అదే బ్రహ్మము. కనుక 'స్వగత భేదమున్ను లేదు.

సజాతీయ భేదమున్ను లేదు. సజాతీయ భేదమనగా 'వేప చెట్టు – రావి చెట్టు. ఇచ్చట 'చెట్టు' అను ఒకే జాతిలో గల యీ భేదము సజాతీయ భేదము. అట్టివి ఏక పదార్థమయిన 'ఆత్మ'కు లేవు. 'ఆత్మ' వంటిది మఱొకటి లేదు.

విజాతీయ భేదమున్ను లేదు. విజాతీయ భేదమనగా 'చెట్టు – రాయి' చెట్టు జాతి వేఱు. రాయి జాతి వేఱు. అట్లు బ్రహ్మకన్న వేఱు జాతి గల

పదార్థము ఏదియు లేదు. ఉన్నదని మనము భావించు 'ప్రపంచము' మిథ్య, మాయ, కల్పితము కనుక దానిని 'విజాతీయమని' చెప్పుటకు వీలులేదు.

కాగా 'బ్రహ్మము' అఖండము. 'సజాతీయ విజాతీయ స్వగత' భేదములేనిది.

ప్రమాణము:- ఈ 'బ్రహ్మము' ఈ 'ఆత్మ' ఉన్నదనుటకు ప్రమాణము ఏమనగా 'శబ్దమే' అనగా వేదము. ఉపనిషత్తులు.

దీనికి ప్రత్యక్ష ప్రమాణము లేదు. రూపము లేదు కనుక. అనుమాన ప్రమాణము లేదు. ఇది అద్వితీయము కనుక. ఇతర పదార్థమును బట్టి దీనిని ఊహింపలేము. పొగను చూచి, నిప్పును ఊహించినట్లు ఇచ్చట సాగదు. ఉపమాన ప్రమాణము కుదరదు. బ్రహ్మము పూర్ణము. కనుక ఇట్టిది లేదు. లోకములో ఆకాశమునకు ఏమి ఉపమానము కలదు. 'అనుపలబ్ధి' ప్రమాణము కుదరదు. ఇది నిత్యము, సర్వవ్యాపి కనుక. 'ఘటాభావమును' అనుపలబ్ధి ప్రమాణముచే గ్రహించెదము.

'బ్రహ్మము - సృష్టి - లీల':- పారమార్థికదశలో శుద్ధ బ్రహ్మమే. ఇది బ్రహ్మకు స్వరూప లక్షణము. సృష్టిపూర్వదశలో ఇంతే. 'సృష్టి లీలా స్థితి' ప్రారంభములో శుద్ధబ్రహ్మమునందు మాయ ఏర్పడినది. అనగా ఆవిర్భవించినది. ఈ మాయ బ్రహ్మకు స్వతస్సిద్ధము. ఇట్లు 'మాయ' ఏర్పడినదశలో బ్రహ్మమును 'మాయా శబల బ్రహ్మము, మాయోపహిత బ్రహ్మము, సగుణ బ్రహ్మము, దృక్+మాయ' అనియు వ్యవహరింతురు. సృష్టి కొఱకు ఏర్పడిన యీ మూర్తి బ్రహ్మమునకు తటస్థలక్షణము. నటునకు రామాది వేషమువలె యిది నటన తర్వాత అనగా లయ కాలమున తొలగును. ఈ సగుణ బ్రహ్మమే ఉపాసనా యోగ్యుడు. ఈ బ్రహ్మమే పరమాత్మ. ఈయనయే ప్రపంచమునకు అధిష్ఠానము. అనగా బొమ్మకు కాగితము వలె, గోడవలె ఈ బ్రహ్మమే ఈశ్వరునకున్ను సాక్షిఅయిన చైతన్యము. అనగా ఈశ్వరుడు త్రిమూర్తులుగా గాని రామకృష్ణాది అవతారములుగా గాని ఆవిర్భవించినపుడు ఆయనకు గల సాక్షి చైతన్యము ఈ 'మాయా శబల బ్రహ్మమే'

మాయా ప్రతిఫలితుడు మాయా విశిష్టుడు ఈశ్వరుడు. ఈయన సమష్టి రూపము. జగన్నిర్వాహకుడు. నిత్యముక్తుడు. దృక్+మాయావృతుడు'. ఇక 'వ్యష్టి' లో అనగా శరీరములో, పరమాత్మను 'ప్రత్యగాత్మ' అందురు. సర్వ శరీర వ్యాపి. అంతఃకరణాది శరీరములందున్నవాడు. సచ్చిదానందరూపుడు. 'పరమాత్మ' మహాకాశము అయినచో, ఈశ్వరుడు మఠాకాశము. ప్రత్యగాత్మ ఘటాకాశము

అనవచ్చును. జీవునకు అనగా చిదాభాసునకు సాక్షి. అంతఃకరణమునకు సాక్షి. ఈయన కూటస్థుడు. వ్యష్టికి అధిష్ఠానము. ఈయన యందే జీవుడు. అనగా చిదాభానుడు అట్లే జీవదశలు కల్పింపబడినవి. ఈ చిదాభాసుడు 'దృక్+ అవిద్యావృతుడు' అందురు. ఈయన అంతఃకరణమునందు ప్రతిబింబించినవాడు. కించిద్జ్ఞుడు. పరతంత్రుడు. కర్త భోక్త ప్రమాత.

**గమనిక:-** ప్రత్యగాత్మనే జీవుడని, చిదాభాసునే జీవుడని, అంతఃకరణమునే జీవుడని, గ్రంథములలో కలగాపులగముగా వాడు చుందురు. నిజమునకు ప్రత్యగాత్మయే 'జీవుడు' అని అనవచ్చును. కాని వ్యావహారికముగా 'నేను' అని వ్యవహరింపబడు చిదాభాసుడే జీవునిగా బాగా చెప్పబడుచున్నాడు. వాస్తవముగా ఇరువురి మధ్య భేదము లేకపోవుట వలన ఈ పరిస్థితి వచ్చినది.

**తత్త్వములు - ప్రత్యేక వివరణ:-** 1) శుద్ధ బ్రహ్మము - నిర్వికారము. అఖండము. సర్వమూలము. సంపూర్ణము. తటస్థము. మాయారహిత స్థితి.

2) మాయా శబల బ్రహ్మము:- 'మాయ' అనగా ప్రకృతి. మూల ప్రకృతి. ఈయన సచ్చిదానందరూపుడు. మాయకు ఆశ్రయము. సృష్టికి పూర్వము ఈయన మాయకు ఆశ్రయము. మాయ ఈయనయందే కల్పితము. 'బ్రహ్మ' యందు ముందు శక్తి పుట్టగా 'శక్తి సహిత బ్రహ్మ' నుండి ఈశ్వరాది జగత్తు పుట్టెను. అ ఈశ్వరునకు ఈయన సాక్షి చైతన్యము.

**3) ఈశ్వరుడు:-** ఈయన మాయాశక్తి వృతుడు. మాయావి. జగత్తు యొక్క సృష్టిలో మాయాసహితుడై ప్రవర్తించును. పురుషుడు. ద్రష్ట త్రిమూర్తి స్వరూపుడు. త్రిలోకవ్యాపి. ఓంకార వాచ్యుడు. ఈయన 'దృక్+మాయావృతుడు'.

మాయావృతుడయినను ఈశ్వరుడు మాయకు లొంగడు. సత్వ ప్రధానుడు కనుక అయన వద్ద మాయ 'వశవర్తిని' అయి యుండును. ఇందులో ఈశ్వరుడు సత్వ ప్రధాన మాయతోనున్నవాడై తమః ప్రధానమాయతో సృష్టి చేయునని ఒక అభిప్రాయము.

మాయాశబల బ్రహ్మకు మాయ ఉపాధి మాత్రమే. అనగా 'పీట' వంటిది. ఈశ్వరునకు మాయ 'విశేషణము' అనగా గుణముగా సాధనముగా నున్నది. జగత్కార్యమున ఈశ్వరుడు మాయాసహితుడై ప్రవర్తించును.

సృష్టి ప్రారంభమున మాయోపహితుడైయున్న ఈశ్వరుడు సృష్టియందు

మాయా సమన్వితుడై ప్రవర్తించును. మాయలో నున్నచో సాక్షి. మాయతో కలిసి సృష్టికి దిగినచో ఈశ్వరుడు. మొదటిది ఈశ్వరసాక్షి చైతన్యము. రెండవది ఈశ్వరుడు. కనుక ఈశ్వరుడు వేఱు సాక్షివేఱు కాదు. దశలు మాత్రమే వేఱు. ఈశ్వరత్వము వేఱు. సాక్షిత్వము వేఱు. ఇవి దశలు.

**4)** ప్రత్యగాత్మ:- అంతఃకరణమునందున్న దశలో 'జీవసాక్షి'. అంతఃకరణముతో కలిసి పనిచేయుదశలో జీవుడు లేదా చిదాభాసుడు.

శరీరవ్యాపి, శరీరాధిష్ఠానము, కూటస్థుడు, నిర్వికారుడు, జ్ఞాన స్వరూపుడు. 'దీపము' అనగా కాంతి గృహమంతయు వ్యాపించినట్లు జ్ఞానస్వరూపుడయిన 'ప్రత్యగాత్మ' శరీరమంతయు, జ్ఞాన రూపముగా వ్యాపించి యున్నాడు. దట్టమయిన కాంతియే దీపము. అందులోని వత్తి దీపము కాదు. పలచని కాంతియే దాని వెలుగు. కనుక 'దీపము - కాంతి' భిన్న పదార్థములు కావు. అంతయు వెలుగే. అట్లే ప్రత్యగాత్మ సర్వ శరీరవ్యాపి అయిన జ్ఞానమే.

ఈ జీవుని 'అణువు' అని శాస్త్రములు చెప్పుట 'దర్శింపసాధ్యము' కానివాడనియే. అంతేగాని 'అంతసన్ననివాడు' అని అర్థము కాదు. అణువంతటి దేహమునందు పర్వతమంతటి దేహమందు పూర్తిగా వ్యాపించినవాడే. కనుక ఉపాధినిబట్టి, 'అణువు' వంటివాడు అని గూడా చెప్పబడినట్లు. కుండలోను కొండలోనూ అకాశము కలదు కదా!

ప్రత్యగాత్మ ఘటాకాశము వంటిది. అందువలన దీనికి శరీర మరణానంతరము ఎచ్చటికోపోవు నవసరములేదు. అచ్చటనే లీనమగును. బుద్ధిగతమయిన అనగా లింగ శరీరగతమయిన చిదాభాసునికి మాత్రమే అనగా చైతన్యయుక్తమయిన అంతః కరణమునకు మాత్రమే 'ఉత్క్రాంతి' జరుగును.

లింగ శరీర గతమయిన చిదాభాసుడు అనగా అంతఃకరణమునందు ప్రతిబింబించిన 'ప్రత్యగాత్మ' రూపమే. అయితే అంతఃకరణము అనగా బుద్ధి మిథ్య. దానికి రూపము లేదు. ప్రత్యగాత్మకున్ను రూపము లేదు. మఱి ప్రతిబింబించుట ఎట్లు యుక్తియుక్తము? కనుక

'ప్రతిబింబించుట' అనగా అర్థము 'ప్రత్యగాత్మ' శక్తి, సన్నిహితమయిన అంతఃకరణమందు ప్రసరించుటయే. అయస్కాంతశక్తి దగ్గఱలోని 'సూది' యందు ప్రసరించుటయే. ఆ కారణముగా సూది కదలును. కనుక సూదియందు 'అయస్కాంత శక్తి' యున్నది. ఈ సోకిన శక్తి సూదితో బాటు కదలును. అయస్కాంతము మాత్రన్గు

కదలదు. అట్లే 'ప్రత్యగాత్మ' సంపర్కము వలన అంతఃకరణము కదలును. ప్రత్యగాత్మ కదలదు.

'కంప్యూటరు' పెట్టెకు 'చలించే' లక్షణము కలదు. కాని 'కరంటు' సోకిననే చలించును. కాని దానితో బాటు ఇంటిలోని కరంటు చలించదు. అట్లే అంతః కరణమున చేరిన 'చిదాభాసుడు' అను 'ప్రత్యగాత్మ శక్తి' అంతఃకరణములో దాని వృత్తులతో కదలును.

'సుషుప్తి' అనగా బుద్ధి తనకు కారణరూపమయిన అవిద్యలో లీన మగుట. అట్టి సుషుప్తిలో అంతఃకరణము, అహంకారము లీనమయినపుడు ఈ ప్రత్యగాత్మయే సాక్షి. కనుక ఇతడు అహంకారము కాదు. అంతఃకరణమున్ను కాదు.

ఇతడు స్వప్రకాశుడు. స్వప్నములో దర్శనము మొదలగు అనుభూతులను - ఇంద్రియములతో పని లేకుండా-అనుభవించును. కనుక ఇంద్రియాతీత మయిన జ్ఞానమే ఇతడు. ఇతనికి 'జ్ఞానము ధర్మము' అని చెప్పుటకు వీలులేదు. అట్లు చెప్పినచో ధర్మరూపమయిన జ్ఞానము పనిచేయుటకు అంతఃకరణము దాని వృత్తులు కావలయును. కాని సుషుప్తిలో అట్టివి తొలగిపోవును. అయినను వ్యక్తికి 'సుఖానుభూతి' కలదు. కనుక జ్ఞానమే, సుఖమే 'ప్రత్యగాత్మ' అనుభవమున్ను ఆత్మయే.

కనుక ప్రత్యగాత్మయే ఆనంద స్వరూపము. సమాధిలోను, 'ఆత్మ' లాభమువలననే ఆనందము. సుషుప్తిలోనూ ఆనందమే. కాని అది అజ్ఞానావృతము. సమాధిలో అజ్ఞానము గూడా తొలగును.

**చిదాభాసుడు (జీవుడు):-** 'ప్రత్యగాత్మ' మూల విరాట్టు అయినచో ఈతడు 'ఉత్సవ విగ్రహము' వంటివాడు. 'వ్యష్టి' లో అనగా శరీరములో వ్యాపించిన ప్రత్యగాత్మ చైతన్యము అంతఃకరణమున ప్రతిఫలింపగా ప్రతిబింబమును జీవుడుగా చెప్పుచున్నారు. నిజమునకు ప్రత్యగాత్మయే జీవుడు. అయినను వ్యవహారములో 'ప్రత్యగాత్మ' ను తత్ప్రతిబింబమును కలిపి గందర గోళముగా 'జీవ' పదముతో వ్యవహరించుచున్నారు. బింబ ప్రతిబింబముల అభేదమును బట్టియే యీ వ్యవహారము వచ్చినది.

కేవలము 'ప్రత్యగాత్మ' అంతఃకరణమున ప్రతిబింబించినంత మాత్రమున జీవునకు సంసారములేదు. వృత్తిరహితమయిన అంతఃకరణముతో విక్షేపము లేదు. యోగికి జ్ఞానికి అంతే కదా! వృత్తి గల అంతఃకరణముతో లేదా అంతఃకరణవృత్తుల తాదాత్మ్యము పొందినపుడు 'సంసారము' తగులు కొనును. ఉదాహరణకు 'టి.వి.' ని

మనము కేవలము 'ఆన్' చేసినపుడు 'తెఱపై' వెండి జిలుగులు వచ్చును. లేదా కాంతి మాత్రమే వచ్చును. అనగా 'విద్యుత్తు' అను చైతన్యము టి.వి. అను జడపదార్థములో ప్రవేశించినది. ఇదే 'ఆత్మ' చైతన్యము జడమయిన అంతః కరణములోనికి ప్రవేశించుట. దానిని చైతన్య పఱచుట దీనియందు కదలికకు కారణమగుట. అనంతరము టి.వి. ఛానళ్లను ప్రారంభిచినచో 'తెఱ' బదులు దృశ్యములు సాక్షాత్కరించును. ఇవి అంతఃకరణ వృత్తుల వంటివి. వీని యందు 'విద్యుత్తు' ఆయా దృశ్యరూపములలో ప్రవేశించి నాటికా నాటకములుగా సాక్షాత్కరించును. కాని దీనివలన ఇంటిలోని 'విద్యుత్తు' లో మార్పులు రావు. ఇదే 'ప్రత్యగాత్మ' కూటస్థముగా నిర్వికారముగా నుండుట వంటిది.

అంతఃకరణమునందుచేరిన యీ జీవచైతన్యమును 'చిదాభాసుడు' అందురు. ఇది అంతఃకరణమునందలి ప్రథమభాగమయిన అహంకారము. కనుక 'అంతఃకరణము, అహంకారము, చిదాభాసుడ' అనునవి యించుమించు సమానార్థకములుగా అద్వైతవేదాంతమున తగులుచుండును.

ఈ చిదాభాసునకే రకరకముల దశలు, భేదములు గలవు. ఇట్టి భేదములు సమష్టిలో 'ఈశ్వరునకు' గలవు. తేడా ఏమనగా ఈశ్వరుడు మాయావశుడు కాదు. ఈదశల విషయము 'అన్తఃకరణము' అను అధ్యాయములో చూడదగును.

చిదాభాసుడనగా అహంకారముతో కలిసిన జీవచైతన్యమని చెప్పి కొంటిమి. 'నేను తెలిసికొన్నాను=అహంజానామి' ఇందు 'నేను' అనునది అహంకారము. అది జడమయిన అంతఃకరణ భాగము. కనుక 'తెలిసికొనుట' దానికి వల్ల కాదు. అందుకు 'చైతన్యము' కావలెను. అనగా టి.వి. యాక్టివేట్ అగుటకు 'విద్యుత్తు' కావలయును గదా! కాగా అహంకారములో దూరిన 'చైతన్యము' కర్త. 'పరమార్థ జ్ఞానము' కలిగిన తర్వాత అహంకారము నశించును. కనుక అహంకారము 'ఆత్మ' కాదు. టి.వి. విద్యుత్తు కాదు. ఈ చిదాభాసునే 'ప్రమాత' అందురు.

1) ప్రమాత = అంతఃకరణముతో తాదాత్మ్యము చెంది 'నేను' అని తనను, అట్లే ఇతరులను తెలిసికొనువాడు.

2) ప్రమాణము = అంతఃకరణ చైతన్యమున ప్రతిబింబితమయిన 'ఘటము' మొదలగు విషయము. ఇది వృత్తికాదు. 'వృత్తి' అనగా బయటకు విషయములపై చైతన్యము ప్రసరించుట.

3) ప్రమేయము = చూడబడిన ఘటము. ఘటముపై చైతన్యము కూడినపుడు ఘటగత చైతన్యము ప్రమేయమగును.

4) ప్రమితి = 'ఇది ఘటము' అను జ్ఞానము. అనగా 'అంతఃకరణ వృత్తి' తో అత్మ సంయోగము.

**ప్రత్యగాత్మ - చిదాభాస(జీవ)తత్వము:-** ప్రత్యగాత్మ - చిదాభాసుడు (ప్రమాత/జీవ) వేఱు కాదు. కనుకనే 'సుషుప్తి'లో జీవుడు లేడు. అంతఃకరణము లేదు. అయినను నిద్రానంతరము 'సుషుప్తి' లోని సుఖానుభూతి తెలియుచున్నది. ఎట్లు తెలియుచున్నది? సుషుప్తిలో జీవుడు లేడు. జాగరణమున జీవుడు కలడు. ప్రత్యగాత్మ జాగరణమున తెలియదు. కాని ఆ ప్రత్యగాత్మ సాక్షిగానున్న 'సుఖము' జీవునకు ఎట్లు తెలియును? మనస్సులేనిదే జీవునకు ఏమియు తెలియదు. టి.వి. తెఱలేనిదే దృశ్యములు రావు గదా! కనుక 'ప్రత్యగాత్మ'యే జీవుడు అనుకొన్నచో సుషుప్తి సుఖానుభవము తెలియుటకు అవకాశము కలదు. కనుక 'ప్రత్యగాత్మయే జీవాత్మ' వీరి మధ్య అభేదమే. భేదము అంతఃకరణము వలన మాత్రమే.

**తేడాలు:-** మాయా శబల బ్రహ్మ, ఈశ్వరుడు, ప్రత్యగాత్మ, జీవాత్మ, వీని విషయములలో శాస్త్రకారుల మధ్య దృక్పథములలో చాల భేదములు గలవు. వానిని సంగ్రహముగా ఇచ్చుచున్నాను. **'సిద్ధాంత లేశ సంగ్రహము'** దీనికి ఆధారము.

1) మాయ బ్రహ్మమునకు సంబంధించినది. సమష్టిది. దీనియొక్క 'అవరణ, విక్షేపణ శక్తులు గల భాగములు అవిద్యలు. ఇవి వ్యష్టులు. ఈ వ్యష్టులయందు ప్రతిబింబించిన చైతన్యము - జీవులు.

2) శుద్ధ సత్వ ప్రధానమయినది - మాయ. అందు ప్రతిబింబించినవాడు - ఈశ్వరుడు. మలిన సత్వ ప్రధానమయినది - అవిద్య. అందు ప్రతిబింబించిన వాడు - జీవుడు. మలిన సత్వము అనగా రజస్సు తమస్సతో కలిసినది.

3) విక్షేప ప్రధాన మాయ. అనగా సృష్టి శక్తి. దానియందున్నవాడు ఈశ్వరుడు. ఈశ్వరోపాధి మాయ.

అవరణ ప్రధాన మాయ. ఇది అవిద్య. ఇది జీవునకు ఉపాధి. అజ్ఞానశక్తి. దీనివలన జీవునకు 'నేను అజ్ఞానిని' అను భావము కలుగును.

4) జీవపరమేశ్వర సాధారణము (Common) అయిన శుద్ధ చైతన్యము (చిత్తు) బింబము - అనగా సూర్యునివంటిది. అవిద్యలో ప్రతిబింబించిన చిత్తు - ఈశ్వరుడు అంతఃకరణ ప్రతిబింబిత చిత్తు - జీవుడు. అవిద్యలోని 'చిత్తు' యొక్క

ప్రతిబింబము అని అర్థము. ఆకాశ సూర్యుడు శుద్ధచైతన్యము - చెఱువులో ప్రతిబింబించిన సూర్యుడు=ఈశ్వరుడు, కడవ నీటిలో ప్రతి బింబించిన సూర్యుడు= జీవుడు. అయితే ఈ మతములో జీవునకు అవిద్యా దోషమున్నట్లు ఈశ్వరునకు మాయా దోషము అంటునని ఒప్పుకొనవలయును. కనుక ఈశ్వరచైతన్యమే బింబమని జీవుడు మాత్రమే ప్రతిబింబమని కొందఱు జీవునకు ఉపాధి అవిద్యయని ఏక జీవనాదులు, అంతఃకరణములు ఉపాధులు అని నానాజీవవాదులు చెప్పెదరు.

5) ఏ) మహాకాశము వంటివాడు పరమాత్మ అనవచ్ఛిన్న చైతన్యము అనగా దేనితోనూ సంగములేని జ్ఞానము. చిత్తు, చితి, జ్ఞానము, చైతన్యము ఈ పదములు సమానార్థకములు.

బి) మేఘాకాశము వంటివాడు ఈశ్వరుడు. అనగా మేఘాకాశమున గల వర్షజలకణములలో అన్నింట ఆకాశము ప్రతిబింబించినట్లు సకల జీవుల బుద్ధి వాసనలందు ప్రతిబింబించిన చైతన్యము ఈశ్వరుడు.

సి) ఘటాకాశమువంటివాడు ప్రత్యగాత్మ. స్థూల సూక్ష్మదేహముల యందున్నను దాని వికారములు అందనివాడు. నిర్వికారుడు.

డి) ఘటజలాకాశము వంటివాడు. చిదాభాసుడు. కుండనీటిలో ఆకాశము ప్రతిబింబించును (ప్రతిబింబించును అనుటకు గుర్తు ఆకాశమునందున్న మబ్బులు నక్షత్రములు వాని మధ్యగల చోటు కుండనీటియందు కనబడును గదా) అట్లే ఘటజలము వంటి అంతఃకరణములో ప్రతిబింబించిన చైతన్యము జీవుడు లేదా చిదాభాసుడు.

6) సుషుప్తి సమయములో అంతఃకరణము ద్రవమువలె విలీనమగును. అప్పుడు మిగులువాడు ఆనందరూపుడయిన ప్రత్యగాత్మయే. నిద్రానంతరము ప్రబోధ సమయములో ఘనీభవించిన అంతఃకరణోపాధిలో విజ్ఞానమయుడు జీవుడు. అంతః కరణమును తైజసద్రవరూపముగా చెప్పెదరు.

7) ఏ) మాయగాని, మాయా కార్యములయిన సృష్టి మొదలైనవి గాని లేనివాడు శుద్ధ బ్రహ్మము. అనగా 'తెల్లని కాన్వాసు పేపరు' వంటివాడు.

బి) మాయయందున్నవాడు. ఈశ్వరుడు అనగా 'మైదాపిండి' పూసిన కాన్వాసు పేపరు వంటివాడు. ఈయనయే తర్వాత మాయా చిత్రములకు ఆధారము అయినవాడు.

సి) పంచీకరణము (సృష్టికోసము నానా వస్తురూపములు వచ్చు ప్రక్రియ) కాక ముందు సమష్టి సూక్ష్మశరీరములో నున్నవాడు 'హిరణ్యగర్భుడు' అనగా 'మసి' పూయబడిన వస్త్రము వంటివాడు. అనగా 'ప్రైమరీ' రంగుపూయబడిన 'కాన్వాసు' వంటివాడు.

డి) పంచీకృతమయిన ప్రపంచమున వ్యాపించినవాడు - విరాట్టు. అనగా రంగురంగుల బొమ్మవంటివాడు.

ఈ) సుషుప్తిలో అంతఃకరణము లీనమయిన దశలో అజ్ఞానమునకు సాక్షిగానున్న జీవుడు=ప్రాజ్ఞుడు, అనందమయుడు.

ఎఫ్) వ్యష్టిలో స్థూల శరీరాభిమాని విశ్వుడు.

8) జీవులు 3 రకములు.

1) పారమార్థిక జీవుడు=ప్రత్యగాత్మ దేహద్వయమునకు అధిష్ఠాత సూక్ష్మ స్థూల దేహములకు అధిష్ఠాత

2) వ్యావహారిక జీవుడు=నేను. అంతఃకరణ ప్రతిబింబితుడు. 'అహం' అను అభిమానము గలవాడు. 'చిదాభాసుడు' ఈయనయే. అనగా మనము మామూలుగా అనుకునే జీవుడు.

3) ప్రాతిభాసికజీవుడు-ఇతడు స్వప్నంలోని అంతఃకరణ వాసనా రూప విశ్వమును అనుభవించు స్వప్న దేహాభిమాని.

ఇందు పారమార్థిక జీవుడు చెఱువు వంటివాడు. వ్యావహారిక జీవుడు తరంగము వంటివాడు. ప్రాతిభాసిక జీవుడు 'బుడగ' వంటివాడు.

9) బింబము=ఈశ్వరుడు, ప్రతిబింబము=జీవుడు. ఈ యిద్దఱియందు అనుగతమయినది శుద్ధచైతన్యము అజ్ఞానప్రతిబింబితుడయిన జీవునకు అజ్ఞాన యంత్రమయిన అంతఃకరణము ప్రత్యేకస్థానము. సూర్యుడు ప్రపంచమంతయు వ్యాపించినను ఆయన ప్రతిబింబము అద్దము, నీళ్ల వంటి చోట్ల మాత్రమే ప్రతిబింబించును. ఇంత మాత్రముచే పాత ఉపాధి అయిన 'అవిద్య' పోదు.

సర్వ సారాంశము

1. అంతఃకరణవృతుడు - ప్రత్యగాత్మ, మాయావృతుడు-ఈశ్వరుడు, మాయాశబల బ్రహ్మ=సగుణబ్రహ్మ. (2)అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము-జీవుడు. మాయావచ్ఛిన్న చైతన్యము-ఈశ్వరుడు. (3) అహంకారమునకు అధిష్ఠానము -ప్రత్యగాత్మ.

అహంకారములో తాదాత్మ్యము చెందిన/కల్సిన వాడు- జీవుడు/చిదాభాసుడు. 4. ఉపాధిని బట్టి నియామకుడు-ఈశ్వరుడు. నియమ్యుడు- జీవుడు. (5) అంతః కరణోపాధిలోని చైతన్యము-ప్రత్యగాత్మ. అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము-జీవుడు, చిదాభాసుడు.

ఈ చిక్కుల నుండి తేలికగా బయటపడి స్థూలముగా విషయము తెలిసి కొనుటకు క్రింది వివరములు సరిపోవును.

(1) శుద్ధ చైతన్యము-సృష్టికి పూర్వము. (2) ఈశ్వరుడు-మాయకు అధిష్ఠాత-ఎ, మాయతో కల్సి సృష్టి చేయుదశ-బి (3) ప్రత్యగాత్మ- శరీరము లందు వ్యాపించిన చైతన్యము. అంతఃకరణమునకు సాక్షిగా ఉండును. (4) జీవాత్మ-చిదాభాస. అంతఃకరణముతో కల్సి ప్రపంచవ్యవహారమున లీనమయిన సంసారి.

ఉపాధిగలవాడు-ఈశ్వరుడు/సగుణబ్రహ్మ, ప్రత్యగాత్మ

ఉపాధితో కలసి పనిచేయువాడు-ఈశ్వరుడు, జీవుడు, చిదాభాసుడు.

**గమనిక:**-ఈశ్వరుడు ఉపాధితో కల్సి పని చేసినను 'స్రష్ట' అయినను మాయకు లొంగడు. జీవుడు అనగా చిదాభాసుడు. అవిద్యతో కలసిపనిచేయునపుడు అవిద్యావశుడు అగును. ఈశ్వరునకు ఉపాధి=మాయ, జీవునకు ఉపాధి= అవిద్య, అంతఃకరణము.

'అవిద్య':- బ్రహ్మ సామర్థ్యమే ఇది. అయన ఇచ్ఛయే యిది. 'ఇచ్ఛ' అనగా లీల. కామము కాదు. అయన పూర్ణకాముడు కదా! బ్రహ్మయందు ముందు శక్తి పుట్టును. అది స్వయముగా పుట్టును. స్వతః కల్పితము. ఇదే ఈశ్వరశక్తి. నిత్య జ్ఞానరూపుడయిన 'బ్రహ్మ' స్థితికి ఈ మాయ ఏమాత్రము భంగము కల్గింపదు. రజ్జువు నందు సర్పభ్రాంతి కల్గినను రజ్జువునకు బాధలేదు. అట్లే 'బ్రహ్మ' యందు ప్రపంచము మాయచే కల్పించబడినను 'బ్రహ్మ' స్వరూపము మాఱదు. రజ్జు జ్ఞానము సర్ప భ్రాంతిని నివారించినట్లు 'బ్రహ్మ జ్ఞానము' మాయను నివారించును.

మాయకు బ్రహ్మయే (శుద్ధ చైతన్యముగా) నిమిత్త కారణము. మాయతో కల్సిన బ్రహ్మము ప్రపంచమునకు ఉపాదాన కారణము. మాయ జగత్తుకు ఉపాదాన కారణము. మాయనుండియే సర్వము ఏర్పడినది. దీనికి 'అవిద్య' అనియు, అజ్ఞాన మనియు పేరు. జీవులందు మాయ అవిద్యగాను లేదా అంతఃకరణముగాను ఏర్పడినది.

కాని 'అవిద్య' అనగా అజ్ఞానము. కనుక జీవునికి 'అవిద్య' అనుట యుక్తము. భగవంతునకు 'అవిద్య' అనగా 'అజ్ఞానము' లేదు కనుక ఆయన వైపు నుంచి 'మాయ' అనుట యుక్తము. అందువలననే 'మాయ' కు ఆయన లొంగడు. ఒక ఇంద్రజాలికుడు తన మాయతో ప్రేక్షకులకు అజ్ఞాన మూలకమయిన ఆశ్చర్యమును కల్గించును. తన మాయ తనే తెలియక ఆశ్చర్య పడడు గదా! ఆయనకు ఇది 'విద్య' కావచ్చును.

ఈ మాయ అనిర్వచనీయము. అనగా మిథ్య. బ్రహ్మకు భిన్నముగా ఈ మాయాశక్తి కనబడదు. కనుక 'అసత్'. ప్రపంచరూపముతో కనబడుచున్నది. కనుక 'సత్'. బ్రహ్మమునందు కల్పితము కనుక అసత్. జ్ఞానముతో తొలగు చున్నది. కనుక - సత్ (ఉన్నదే గదా తొలగునది). కనుక ఉన్నదని చెప్పలేము. లేదని చెప్పలేము. కనుక అట్టిది 'అనిర్వచనీయము' అందురు. దానినే 'మిథ్య' అందురు. ఉదాహరణకు 'రంగ, రజతములు', రంగము=తగరము, రజతము =వెండి.

'తగరము' ను చూచి 'వెండి' అనుకొంటిమి. అనుకొన్నంత సేపు అది 'సత్' అనగా 'ఉన్నది'. కాని వాస్తవముగా 'వెండి' లేదు. కనుక 'అసత్'. కాగా ఈ సందర్భములో 'వెండి' మిథ్య.

మాయా కార్యమయిన జగత్తున్ను మిథ్యయే. అవిద్యయే. సర్వవృత్తి జ్ఞానములు మిథ్యయే. చివఱకు 'బ్రహ్మ' తో జీవునకు అభేదము సత్యమయినను ఆ 'అభేద జ్ఞానము' గూడా మిథ్యయే.

సర్వజీవుల ప్రారబ్ధవశమున బ్రహ్మయందలి మాయలో సృష్టికై ఆవరణ విక్షేప చర్యలు ప్రారంభమగును. ఆవరణమనగా మేఘము ఆకాశమును కప్పునట్లు శుద్ధ బ్రహ్మమును కప్పుట. కల్పిత సర్పము రజ్జువును కప్పుట - ఆవరణమే.

'విక్షేపము' అనగా బ్రహ్మమునందు ఆకాశాదులను సృష్టించుట అట్లే మేఘము ఆకాశములో గంధర్వనగరములను సృష్టించుట. (గంధర్వనగరములు అనగా మబ్బులతో ఏర్పడే వివిధాకారములు)

ఆవరణ విక్షేపములు '2' న్ను మాయాశక్తులే. సృష్టి తర్వాత జీవులందు 'అంతఃకరణములు' ఏర్పడును.

ఈ అవిద్యకు ఉదయనాశములు లేవు. జ్ఞానము వలన ప్రతిబంధమే. ముక్తితోనయినను ఆ జీవుని పూర్తిగా విడిచిపోవును. సమాధిలో విక్షేపములు

చేయకయుండును. సుషుప్తిలో ఆవరణముగా నిలుచును. జ్ఞానికయినను దేహపాతము వఱకు ఉండును. ఈ మాయ బ్రహ్మ భిన్నమయిన లక్షణములు గలది.

బ్రహ్మ = సత్యము, జ్ఞానము, ఆనందము.

మాయ = మిథ్య, అజ్ఞానము, అవిద్య, జడము, దుఃఖము

'మాయ' జడము కనుక స్వయముగా సృష్టి చేయలేదు. కనుక దీనికి చైతన్య సహాయము అవసరము. 'కంప్యూటరు' కు 'కరెంటు' వలె.

కనుక 'పరమాత్మ' చైతన్య ప్రసారము వలన విశ్వమందు 'మాయ' కదలుచున్నది. 'ప్రత్యగాత్మ' చైతన్య ప్రసారము వలన జీవునియందు 'అవిద్య' కదలుచున్నది.

అవిద్య వలన 'అధ్యాస' జరుగుచున్నది. 'అధి' అనగా పైన, 'ఆస' అనగా 'పడవేయుట' అనగా 'శుద్ధబ్రహ్మ' పైన జగత్తును ఆరోపించుట అని అర్థము. అది కానిదానిని దానియందు ఆరోపించుట అధ్యాస. ఇది '2' విధములు. 1) ప్రాతిభాసికము – రజ్జువును చూచి సర్పముగా తలచుట. ఇది తాత్కాలికము. 2) వ్యావహారికము – ప్రపంచమంతయు అట్టిదే. బ్రహ్మమునందు ప్రపంచవ్యవహారమును ఆరోపించుట. అధ్యాస మఱల '2' విధములు 1) కారణాధ్యాస – కారణమయిన 'మాయను' బ్రహ్మమునందు ఆరోపించుట. కారణము అనగా సృష్టికి కారణము. 2) కార్యాధ్యాస – శరీరేంద్రియములను 'ఆత్మ' యందు, ప్రపంచమును బ్రహ్మమునందు ఆరోపించుట.

కార్యము=అనగా సృష్టింపబడినది. ఇందు కారణాధ్యాస వలన ప్రపంచము ఏర్పడినది. బ్రహ్మమునుండి ప్రపంచము ఏర్పడుట వివర్తమే కాని పరిణామము కాదు. రజ్జువునందు సర్పము ఏర్పడుట వివర్తము. మట్టియందు 'కుండ' ఏర్పడుట పరిణామము. మాయ నుండి జగత్తు పరిణమించినది. ఇది పరిణామము.

అన్యోన్యాధ్యాస:– ఈ 'అధ్యాస' '2' వైపులనుంచి జరుగును. బ్రహ్మయందు మాయాధర్మములయిన అజ్ఞానాదులు, మాయయందు బ్రహ్మ ధర్మములయిన సత్యజ్ఞానాదులు ఆరోపింపబడును. అందు నిరుపాధిక బ్రహ్మ యందు జగత్తు, సోపాధిక బ్రహ్మయందు అనగా రజ్జువునందు సర్పము 'అధ్యాస' చేయబడును. ఈ అధ్యాసము 'బ్రహ్మ' యందు స్వతః జరుగును. అట్లే 'వ్యష్టి' లో ఆత్మధర్మములయిన 'సత్య జ్ఞానములు' మనస్సునందు మనోధర్మములయిన సుఖదుఃఖములు ఆత్మయందు ఆరోపింపబడును.

మామూలుగా అధ్యాసలో ఒక తెలిసిన వస్తువునందు మఱొక తెలిసిన వస్తువును ఆరోపించుట జరుగును. మఱి 'బ్రహ్మము' అసలు కనబడదు. తెలియదు. దానిపై జగత్తును ఆరోపించుట యెట్లు? అని ప్రశ్న. దానికి సమాధానము. కర్ణుడు రాధేయుడు కాదు. కౌంతేయుడే. కాని అతడు 'రాధేయుడ' నని భ్రమించును. ఇది భ్రమయే గదా! కౌంతేయుడనని తెలిసిన తర్వాత తెలియకముందున్ను ఇది భ్రమయే. అట్లే ఒక రాజకుమారుడు శిశువయసులోనే అరణ్యమున 'భిల్లకుమారుడు' గా పెరుగుచున్నాడు. అతను తనను భిల్లకుమారుని గానే భావించికొనును. ఇది భ్రమయే కదా! అట్లే 'బ్రహ్మ'మని తెలియకపోయినను దానిని 'ప్రపంచముగా' భావించుట భ్రమయే అధ్యాసయే.

**అజ్ఞానము - భావ పదార్థము :**

మాయ లేదా అవిద్య - దీనినే 'అజ్ఞానము' అందురు. 'అజ్ఞానము' అనగా 'జ్ఞానములేకుండుట' అని కొందఱు, 'జ్ఞానము కానిది' అని కొందఱు. అద్వైతమున 'అజ్ఞానము' అనగా 'జ్ఞాన భిన్నమయినది' అని అర్థము. ఇది 'అభావము' కాదు. ఒక 'భావ' పదార్థము. ప్రత్యేక అస్తిత్వము కల పదార్థము. ఇదే సృష్టి కారణము. అధ్యాస కారణము. సృష్టి దీని కార్యము. రామానుజ ప్రోక్తమయిన 'అచిత్తు' ఇదియే. కాని వారు దీనిని విడిగా గుర్తించియు 'అజ్ఞానమును' జ్ఞానాభావముగా గుర్తించిరి. కాని అచిత్తును చిదభావముగా భావింపక 'చిద్భిన్నము' గా గుర్తించిరి.

శ్రుతిస్మృతి గీతాదులందు 'అజ్ఞానము' ప్రత్యేక పదార్థముగా చెప్ప బడినది. 'అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః' 'దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా', 'విభేదజనకే అజ్ఞానే', 'విజ్ఞానమజ్ఞాన భిదాపమార్జనమ్'. ఇది ఒక పదార్థము కనుకనే, దీనికి ఇట్టి గుణములు కలవు. 1) మోహజనకత్వము, 2) ఆవరణ కారకత్వము, 3) జ్ఞాననివర్త్యత్వము, 4) త్రిగుణమయత్వము, 5) దురత్యయత్వము, 6) భేదజనకత్వము, 7) సృష్టిక్రమము లో మహత్తునకు అహంకారమునకు హేతువు, 8) ప్రతీయ మానత్వము. అనగా జగత్తుగా, సర్వముగాతోచుచున్నది. ఇంద్రియ గోచరత్వము. అభావమునకు ఇట్టి ధర్మములుండవు. 'శశశృంగము' నకు ధర్మములుండవు కదా! లేనిది లేనిదే. దానికి గుణక్రియలు లేవు. వేదాంతుల మతములో 'చీకటి'యు భావ పదార్థమే. చీకటికి నలుపు, చలనము మొదలగు గుణక్రియలు గలవు కదా!

పైగా జ్ఞానమునకు జ్ఞానాభావమునకు ఈ 'అజ్ఞానమే' కారణము. 'సత్వాత్ సంజాయతే జ్ఞానం, రజసో లోభః ఏవచ,ప్రమోదమోహౌతమసః, భవతః అజ్ఞానమేవచ'. త్రిగుణాత్మక ప్రకృతిమాయ. అదియే అజ్ఞానము. దానిలోని సత్వమువలన జ్ఞానము, తమస్సు వలన జ్ఞానాభావము వచ్చును అని గీత. మఱియు, 'అజ్ఞానము' కార్యము కారణము గూడ అగును.

మూలాజ్ఞానము (మాయ) - కారణము,

తూలాజ్ఞానము - కార్యము

ఈ తూలాజ్ఞానము ప్రతిజీవియందు నిద్ర, మొదలగు వానియందు ఉండును. నిజముగా అభావమయినచో అజ్ఞానమునకు ఈ కార్యకారణత్వ ధర్మములుండవు. మఱియు, మాయ సృష్టి కారణము. అందలి 'తమో' గుణము ఆకాశాది సృష్టి హేతువు. కనుక అజ్ఞానము, ప్రకృతి అనుకొన్నను, ప్రకృతిలోని గుణము అనుకొన్నను భావరూపమే కదా! అభావమయినచో 'కారణత్వము' లేదు కదా! ఏ ధర్మములు ఉండవు గదా! మఱియు 'అహం బ్రహ్మాస్మి' - జ్ఞానము. 'నాహం బ్రహ్మాస్మి' - అజ్ఞానము. జ్ఞానముచే 'అజ్ఞానము' తొలగును. పైగా భావాభావములకు విరోధముండును. జ్ఞానాజ్ఞానములకు విరోధము లేదు. 'అజ్ఞానము జ్ఞానమును ఆవరించి యున్నది. బత్తాయిపండును తోలు ఆవరించి యున్నది. దీపమును మసి ఆవరించి యున్నది. అయితే బత్తాయిపండుకు తోలుకు విరోధము లేదు. అట్లే జ్ఞానాజ్ఞానములకు విరోధము లేదు. బ్రహ్మసాక్షాత్కార వృత్తికి అజ్ఞానమునకు విరోధము కలదు. దాని వలన అజ్ఞానము తొలగును. కనుక అజ్ఞానము భావ పదార్థమే, ప్రపంచము వలె. బ్రహ్మదృష్ట్యా మిథ్యయే. అభావము మాత్రము కాదు.

**అంతఃకరణము:-** ఇది అవిద్యయే. అవిద్య క్రింద చెప్పిన విషయము లన్నియు 'వ్యష్టి' లో అంతఃకరణమునకు చెల్లును. ఎవరి అంతఃకరణము వారిదే. దీనినిబట్టి జీవభేదము ముక్తి భేదము జరుగును. 'వ్యష్టి' లో ఇది 'అంతఃకరణము' అయినది. లేదా, సమష్టిలోనిది 'మాయ' అనుకొన్నచో 'వ్యష్టిలోనిది' అవిద్య అనవచ్చును. బ్రహ్మవైపునుంచి 'మాయ' అనుకొన్నచో వ్యష్టిలోనిది 'అవిద్య' అనుకొనవచ్చును. ఈ 'అంతఃకరణము' 'కంప్యూటర్' లో 'సాఫ్ట్‌వేర్' వంటిది. లేదా ఒక 'అద్దము' 'సరస్సు' వంటిది. 'ప్రత్యగాత్మ' లేదా 'అంతరాత్మ' దీనియందు ప్రతిఫలించును. అనగా ఆత్మ యొక్క చైతన్యశక్తి ఇందు సంక్రమించినను అంతఃకరణము, అందు ప్రతిబింబించిన శక్తియు కలిసి 'జీవుడు / చిదాభాసుడు' అగును.

దీనియందు ప్రతిబింబించిన సుఖ/ అనంద / జ్ఞానములకు 'అకారము' లేదు. అనిర్వచనీయము. ప్రతిబింబించినంత మాత్రమున సంసారమున్ను లేదు. దీని 'వృత్తి' యందు ప్రతిబింబించిన సుఖము మొదలగు వానికి అకారము కలుగును. 'అహం సుఖీ'=నేను సుఖముగానున్నాను' అని దాని అకారము. వృత్తియందు ప్రతిబింబించినపుడే జీవునకు సంసారము కలుగుసు.

అంతఃకరణము లేనిచోట చైతన్యము ప్రతిఫలించదు. అచేతనము లందు అంతఃకరణము లేదు. అందువలన 'చేతన' కార్యములు (వృత్తులు) లేవు. చేతనములకు అచేతనములకు ఇదే భావము. అంతే తప్ప 'అత్మ' వలన కాదు. అది సర్వవ్యాపి. అంతఃకరణము '3' విధములు.

1) నిర్వృత్తి:- వృత్తిలేనిది. ద్రవముగా లీనావస్థలో నుండును. దీనిని 'తైజస ద్రవము' గా చెప్పెదరు. ఇదే ఆనందమయకోశము. ఇది కేవల సుఖాకారము. అంతఃకరణము జ్ఞానములో లయమగును. ఇట్టి స్థితి సమాధిలో జరుగును.

సమాధి:- మనస్సు లేదా అంతఃకరణము వ్యాపార శూన్యమయినచో సమాధి. అపుడు 'బ్రహ్మాస్ఫురణ' కలుగును. జ్ఞానము వలన మనస్సును నిర్వ్యాపారము చేసినచో బ్రహ్మదర్శనమే. అదే 'మనస్సుతో' కనుగొనుట. జ్ఞానమువలన 'అహం-మమ' పోవును కనుక మనస్సు నిర్వ్యాపారము. అవరణ, విక్షేపములు ఉండవు. 'సమాధి' తరువాత మఱల మనస్సు వచ్చును. 'ముక్తి' లో మాత్రమే అంతఃకరణము పూర్తిగా చచ్చును. ముక్తియు దేహపాతానంతరము వచ్చును. అదే 'విదేహముక్తి'.

సుషుప్తి:- సుషుప్తిలో మనస్సు/ అంతఃకరణము లీనమయియుండును. వ్యాపారము ఉండదు. ధర్మాధర్మ సంస్కారములు కారణరూపముగా నుండును. అహంకారము నశించును. 'నేను, చేయుచున్నాను' అనునవి లేవు. కనుక మిగిలినది ఆత్మయే. కాని 'అంతఃకరణము' అసలు పోదు. అది అత్మకు అవరణముగా నిలుచును. అయితే విక్షేపములుండవు. అదే తేడా. సుషుప్తిలో లీనమయియున్న 'అంతఃకరణము' వలననే (సంస్కార రూపముగా నున్న మనస్సు) సుషుప్తి తరువాత 'సుషుప్తి' లోని సుఖము తెలియును. జ్ఞానము కలుగుటకు 'అత్మ+మనస్సు' కావలయును. సుషుప్తిలో మాత్రము 'అత్మ' వలననే జ్ఞానము.

2) సవృత్తి:- ద్రవీభూతమయిన అంతఃకరణము 'వృత్తి' కొఱకు 'ఘనీభూతము' అయినది. ఇది విజ్ఞానమయకోశము. ఇచ్చట బుద్ధిరూపముగా అంతఃకరణము

ఉండును. 'నేను సుఖిని' అను భావన వృత్తి జ్ఞానము. ఈ 'అంతఃకరణము' మనస్సు రూపము దాల్చి 'మమకారము' కలదగును. 'నాది ఇది' అను భావన. ఇది మనోమయ కోశము. అంతఃకరణము 4 విధములు. .

1) **అహంకారము:-** ఇది అంతఃకరణములో మొదటి భాగము. అత్యంత ముఖ్యము. ఇదే జీవునకు ఉపాధి. విశేషణము. ఇచ్చటనే 'గ్రంధి' ఏర్పడును. 'గ్రంధి' అనగా 'పీటముడి'. దీనినే 'అహంకార గ్రంధి' అందురు. దీనియందు 'నేను' అను అభిమానము ఉండును.

2) **బుద్ధి:-** నిశ్చయ రూపమయిన అంతఃకరణము.

3) **మనస్సు:-** వికల్ప సహిత ఆలోచనా రూప అంతఃకరణము.

4) **చిత్తము:-** స్మృతి సహిత అంతఃకరణము.

**గమనిక:-** 'అంతఃకరణము-మనస్సు-బుద్ధి' అనునవి పర్యాయపదములుగా వాడబడుచుండును.

ఈ అంతఃకరణమే అద్వైత సిద్ధాంతము ప్రకారము కర్త భోక్త ప్రమాత. ఇదే చిదాభాసుడు. దీనియందే ప్రత్యగాత్మ శక్తి ప్రసరించును. ఆ శక్తియే ఆ ప్రతిబింబమే 'జీవుడు / చిదాభాసుడు' అని అందురు. ఇంతకూ అది 'అంతః కరణమే'. 'తాదాత్మ్య' అధ్యాసము వలన ఇవన్నియు 'జీవుడు' అనిపించును. ఈ అధ్యాస 3 విధములు.

1) ఆత్మ - అహంకారముల అధ్యాస. అహంజానామి. నేను ఎఱుగుదును. నేను=అహంకారము, ఎఱుగుట=జ్ఞానము=ఆత్మ చైతన్యము.

2) ఆత్మ - మనస్సుల అధ్యాస. అహం సుఖీ-నేను సుఖముగానున్నాను. సుఖము మనోధర్మము. 3 )

ఆత్మ - శరీరము. అహం మనుష్యః - నేను మనుష్యుడను. మనుష్య జాతి శరీర ధర్మము.

**వివరణము:-** జీవుడు మొదట 'అహంకారమున' ప్రతిఫలించును. అంతఃకరణమునకు '2' వృత్తులు కలవు. 1) అహంవృత్తి=అహంకారము, 2) ఇదం వృత్తి=మనస్సు.

'అహంకారము' వలన మనస్సు, దీని వలన ఇంద్రియములు పనిచేయును. అంతఃకరణమున అహంకారము మొదటిది. కనుక 'అహంవృత్తి' మొదటిది. కనుకనే జీవుడు మొదట దీనియందు ప్రతిబింబించును. కనుక ఇది ముఖ్యోపాధి. చైతన్య ప్రతిఫలనమువలన 'అహంకారము' (కరంటు చేత కంప్యూటరు వలె)

సచేతనము (Activate) అగును. ఇది అహంకార గ్రంధి. ఇదే పెద్ద పీటముడి. దీనివలన 'చిదాభాసుడు' ఏర్పడెను. 'అహం' అనుభావము వచ్చెను. మనస్సుతో సంబంధించి 'అహం సుఖీ' అయినది.

**దశలు - కోశములు:-** ఈ చిదాభాసునకు అవస్థాత్రయము, శరీరత్రయము, నామత్రయము వచ్చినది. చూ॥

| దశ | శరీరము | నామ |
|---|---|---|
| జాగ్రత్ | స్థూల | విశ్వ/వ్యావహారిక |
| స్వప్న | సూక్ష్మ/లింగ | తైజస/ప్రాతిభాసిక |
| సుషుప్తి/మృతి/మూర్ఛ | కారణ/అజ్ఞాన/అవిద్య | ప్రాజ్ఞ/పారమార్థిక |
| సమాధి | 'ప్రత్యగాత్మ' | |

సమాధిని 'తురీయదశ' అందురు.

**కోశములు:-**

| | |
|---|---|
| అన్నమయ కోశము | - శరీరము |
| ప్రాణమయ కోశము | - ఆకలి, దప్పిక |
| మనోమయ కోశము | - 'ఇదమ్' అనునది మనస్సు |
| విజ్ఞానమయ కోశము | - 'నేను' అను అంతఃకరణ వృత్తి 'అహంజానామి |
| ఆనందమయ కోశము | - కారణ శరీరము అవిద్య, ప్రత్యగాత్మ స్థితి |

**అంతఃకరణము-వృత్తులు:-** చైతన్యము '3' విధములు.

**1) ప్రమాతృ చైతన్యము:-** అనగా అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము. అనగా అంతః కరణముతో గూడిన చైతన్యము. అనగా చిదాభాసుడు. వెలుగుచున్న 'బ్యాటరీ బల్బు' వంటివాడు.

**2) ప్రమాణ చైతన్యము:-** అంతఃకరణ వృత్తిలో ప్రవేశించి దానితో కలిసిపని చేయు చైతన్యము. 'బ్యాటరీ లైటు ఫోకస్' వంటిది. దీనినే 'వృత్తి చైతన్యము' అందురు.

**3) విషయ చైతన్యము:-** ఘటము మొదలగు బాహ్య వస్తువులకు సుఖము మొదలగు అంతఃకరణ ధర్మములకు అధిష్ఠానముగా నుండు 'చైతన్యము' అనగా ఘటాదులస్థానమున నుండిన 'వాస్తవ సత్త' అనగా 'బ్రహ్మము' లేదా జీవుడు.

**ప్రమాణ చైతన్యము - ప్రత్యేక వివరణ:-** దీనినే చైతన్యము అందురు. అంతః

కరణము యొక్క వృత్తియిది. ఇది మిక్కిలి పలచని 'కాంతి' వంటి ద్రవ్యము. ఇదే ఎదుటి విషయములను మనకు తెలుపునది. దీనికి ఎదురుగా సాకారమయిన వస్తువులు ఏవియున్నను, 'కన్ను, చెవి' మొదలగు ఇంద్రియముల ద్వారా ఈ చైతన్యము బయటకుపోయి ఆ వస్తువును తాకి మనకు అనగా ప్రమాతకు తెలియజేయును. దీనిని 'బాహ్యవృత్తి' అందురు. దీనికి విషయము+ ఇంద్రియముల సన్నికర్ష=కలయిక యుండును.

సుఖము దుఃఖములు మొదలైనవి అంతఃకరణములోపలివి. వీనికి 'బాహ్యవృత్తి' అవసరము లేదు. 'అంతఃవృత్తి' చాలును. ఇంద్రియములకు సుఖాదులు అందవు. మనస్సునకు అందును. మనస్సు ఇంద్రియము కాదు. కనుక సుఖాదులు ఇంద్రియ జన్యములు కావు. కనుక 'అంతఃవృత్తి' స్వయముగా జరుగును.

వృత్తి చైతన్యము - బాహ్యప్రత్యక్షము.

చెఱువు నీరు 'గండి' నుండి పిల్లకాలువ ద్వారా పొలమునందు వ్యాపించి 'పొలము అకారము' గా మాఱును. అట్లే అగ్ని కొలిమిలోని ఇనుపగుండునందు ప్రవేశించి గుండు ఆకారముగా మారును. ఇనుపగుండు అగ్ని వర్ణముగా మాఱును. అట్లే

తైజస ద్రవ్యమయిన అంతఃకరణము సూర్యకిరణము వంటిది. అది నేత్రాది ఇంద్రియము ద్వారా - బ్యాటరీ లైటు ఫోకస్ వలె విషయ (ఘటం) ప్రదేశమునకు సోకి ఆ విషయ (ఘటము) ఆకారముగా పరిణమించును. ఇట్లు పరిణమించుటయే వృత్తి.

చెఱువునీరు=జీవచైతన్యము, అంతఃకరణములోని చైతన్యము. గండి=కన్ను, చెవి మొదలైనవి ఇంద్రియములు, పిల్లకాలువ=చూపు మొదలైన ఇంద్రియ మార్గములు 'స్విచ్ బోర్డు' నుంచి వైరు వంటిది, పొలము=ఘటము మొదలైన విషయము.

'3' చైతన్యములు ఒకచోట కలియుట ప్రత్యక్షము. ప్రమాతృ చైతన్యము (ద్రష్ట, శ్రోత), ప్రమాణ చైతన్యము ద్వారా అనగా ఇంద్రియములద్వారా ప్రసరించు చైతన్యము ద్వారా, జడమయిన విషయమునందలి చైతన్యమును, (కుండ, మనిషి శరీరము) విషయమున్న స్థలముదాకా సాగి కలియుటయే ప్రత్యక్షము. అనగా 'కంటి నుండి బయలుదేఱిన చూపు కుండను కలియుట' అని బాహ్యార్థము. మఠాకాశము మఠములోని ఘటాకాశము వస్తుతః ఒక్కటే కనుక కలిసిపోవును. మిల్లులోని బియ్యము, బస్తాలలోని బియ్యము ఒక్కటే కనుక కలిసిపోవును. అట్లే

పై '3' చైతన్యములు ఒక్కటే కనుక కల్సిపోవును. **వృత్తి చైతన్యము - అంతః ప్రత్యక్షము.**

అంతఃకరణధర్మములు అయిన సుఖదుఃఖాదులు, కేవలము సాక్షి(అత్మ) భాస్యములు. ఇంద్రియ వ్యాపారములతో పనిలేదు. అసలు ఇంద్రియజన్య వృత్తులు ఉండవు.

అంతఃకరణమునకు 'అహం' వృత్తి కలదు. ఈ వృత్తి గల అంతఃకరణమునందే 'చైతన్యము' చేరును (అహంవృత్తి అనగా కలరు టి.వి.లో ఉండే కలరు వంటిది) అహంవృత్తి=నేను అను అంతఃకరణ వృత్తి. దీనినే 'అవిద్యా వృత్తి' అనవచ్చును. అహం వృత్తి వలననే 'అహంసుఖీ' మొదలగు భావనలు కలుగును. ఈ భావనలు ప్రత్యక్షమగు విధానము ఇది.

సుఖదుఃఖములకున్ను వాని స్థానములో అసలయినది బ్రహ్మమే, చైతన్యమే. 'నేను సుఖిని' అను అంతఃకరణవృత్తియు 'చైతన్యమే'. అనగా వృత్తి యందున్నది చైతన్యమే. కనుక సుఖాది అకారముతో పరిణమించిన అంతఃకరణముతో తాదాత్మ్యము వలన 'అహంసుఖీ' అను సుఖప్రత్యక్షము జరుగును.

**స్వప్న ప్రాతిభాసికములు - ప్రత్యక్షము.**

స్వప్నములందు భ్రాంతి స్థలములందు ఇంద్రియములు పనిచేయవు. అందుకై 'అవిద్యావృత్తి' స్వీకరింపబడినది. సాక్షాత్తుగా ఈ దృశ్యములు 'మాయా పరిణామములు అనికొందఱు, అంతఃకరణము ద్వారా మాయా పరిణామములు అని కొందఱు, అంతఃకరణ వృత్తి యనికొందఱు.

స్వప్నములో ఇంద్రియవ్యాపారములు లేవు. కనుక అచ్చట బాహ్యాంతఃకరణ వృత్తులు ఉండవు. లేనివానిని చూచునది. 'అవిద్యావృత్తి' అట్లే 'సుషుప్తి' యందున్నది అవిద్యా వృత్తియే. అవిద్యా వృత్తికి అవిద్యయే అనగా అజ్ఞానమే గోచరమగును. అజ్ఞానము అనగా సుషుప్తిలో 'ఒళ్ళెరుగనితనము'. ప్రాతిభాసిక స్థలములందు అనగా తగరమును చూచి వెండి అని, త్రాడును చూచి పాము అని భ్రాంతిచెందిన చోట్ల 'ప్రత్యక్షము' అగు విధానము ఇది. తగరమును చూచి 'ఇది వెండి' అని భావింతుము. ఇది-అనగా మెరిసే వస్తువుతో నిండిన చిత్తవృత్తి ఏర్పడును. ఈ చిత్తవృత్తియందు 'ఇది'లోని చైతన్యము ప్రతిబింబించును. ఇపుడు 'ఇదం' లోని చైతన్యముతో, ప్రమాత చైతన్యము వృత్తి చైతన్యము ద్వారా కలిసినది. ప్రత్యక్షము జరిగినది.

'ఇది' అను విషయ చైతన్యము నందలి 'తగరము' అను అవిద్య (అనగా బ్రహ్మమునందు తగరమును భాసింపజేసిన అవిద్య ఇచ్చట ఆ తగరమునందు వెండిని భాసింపజేయును) పోలిక వలన వచ్చిన 'వెండి' అను సంస్కారముతో కలిసి'కంటి'దోషముల సహాయమున 'వెండిగా' సాక్షాత్కరించును. పరిణామము రజతము. ఇచ్చట 'కన్ను' తగరముతో కలిసినను తగరము కాక 'వెండి' కనబడుట అవిద్యా (అజ్ఞానం / భ్రాంతి) ప్రభావమే. కనుక 'అవిద్యావృత్తి' యిది.

**వృత్తి-ప్రయోజనము.**

చైతన్యము సర్వవ్యాపి అయియున్నను, అందఱికి అన్ని విషయములు తెలియకపోవుటకు కారణము చైతన్యమునకున్న 'అవిద్యావరణములు' అని కొందఱు. అనగా ప్రతివస్తువు ప్రతిజీవి 'ఆవరణము'వలన వేఱు వస్తువులుగా కనబడుచున్నారు. ఈ అవరణము భంగమయి 'ఘటము' మొదలైనవాని జ్ఞానము కలుగును. కొందఱనెదరు. చైతన్యము సర్వవ్యాప్తమయినది. అయినను అది తటస్థము దానికి దేనితోను సంబంధము లేదు. అందుకై ఘటాది అకారము గల 'వృత్తి' కావలయును. దాని ద్వారా '2' చైతన్యములకు సంబంధము ఏర్పడును. కనుక వృత్తి వలన సంబంధము ఏర్పడుట ప్రయోజనము. లేదా అనేక జీవులు తమ తమ అంతః కరణ బద్ధులు. వారికి ఇతర ఘటాది పదార్థముతో సంబంధము లేదు. బ్రహ్మము సర్వవ్యాపి అయినను అంతఃకరణబద్ధుడయిన జీవునకు బ్రహ్మ యొక్క జ్ఞానము సంక్రమించదు. అందువలన అంతఃకరణ వృత్తి వలన జీవునకు / చిదాభాసునకు విషయముతో సంబంధము ఏర్పడను. కనుక 'వృత్తి' 'సంబంధము' కొఱకే అని కొందఱు.

**జగత్తు-శరీరము:-**

సమష్టిలో-జగత్తు, వ్యష్టిలో-శరీరము సమానములు. 'దృశ్యము, అవిద్య, జడము' అను పేర్లు 'జగత్తు' కు శరీరమునకు సమానముగా వర్తించును. శరీరమును క్షేత్రమనియు అందురు. నిరవకాశమయిన 'బ్రహ్మము' నుంచి మాయ వలన అకాశము ఏర్పడును. రజ్జువు నుంచి 'భ్రాంతి' చేత సర్పము ఏర్పడినట్లు ఈ సృష్టి ఏర్పడినది. ఈశ్వరాహంకారము నుంచి 'వ్యష్టి' అహంకారముదాకా అహంకారము నుంచి వ్యక్తుల దాకా, అంతా అవిద్య. జడము. ప్రపంచమును 'విరాట్టు' అందురు. ప్రపంచము '2' విధములు. 1) అమూర్తము-అనగా మూర్తి (శరీరము) లేనివి అకాశ వాయువులు, అంతఃకరణము, ఇంద్రియములు. 2) మూర్తము- అనగా

'మూర్తి' కలవి. పైన చెప్పినవి కాక మిగిలిన 'నీరు' మొదలైన భూతములు, దేహము మొదలైనవి.

**దశలు-శరీరములు-నామములు:-**

**సమష్టి**

స్థూల - విరాట్ - వైశ్వానర;

సూక్ష్మ - లింగ - హిరణ్యగర్భ;

కారణ - కారణ, (అవిద్య) - మాయావి.

**గమనిక:-** హిరణ్యగర్భుడు త్రిమూర్తులకు గూడా ప్రథమ జీవుడు. హిరణ్య గర్భుని లింగశరీరము-మహత్తు, వ్యష్టిలింగ శరీరము-అహంకారము.

**వ్యష్టి**

స్థూల - దేహము - విశ్వ - అన్నమయకోశము;

సూక్ష్మ - లింగ - తైజస - ప్రాణ, మనో, విజ్ఞానకోశములు;

కారణ - కారణ, (అజ్ఞాన) - ప్రాజ్ఞ - ఆనందమయకోశము.

**తత్వములు:-** ఇవి ఒక లెక్కన 25. ఈశ్వర-1, జీవ-1, మనస్సు-1(అంతః కరణము), అవిద్య-1(అజ్ఞానము), ప్రాణము-1, ఇంద్రియాలు-10, శబ్ద స్పర్శ రూపరస గంధములు-5, భూతములు-5 మొత్తం-25. ఇందు మనస్సును '4' అనుకొన్నచో అదనముగా 3 (బుద్ధి, చిత్త, అహంకార); ప్రాణములు '5' అనుకొన్నచో అదనముగా 4 (అపాన, వ్యాన, ఉదాన, సమాన) మొత్తం-7. తత్వములు మొత్తము 25+7=32. లింగశరీరము=ప్రాణమనోవిజ్ఞానకోశములు అనగా ఇంద్రియములు-10, భూతములు-5, అంతఃకరణములు(మనస్సు)-1, మొత్తం-16. ఇదే సూక్ష్మ శరీరము. దీనినుండి జీవునకు జ్ఞానపర్యంతము మోక్షము లేదు. దీనియందే కారణశరీరమున్ను కలిసియుండును.

**గమనిక:-** 1) జగత్తు-దేహము=ఈశ్వరసృష్టి, ఇది జ్ఞానముతో నశించదు. ప్రళయమరణములతో నశించును. 2) అభిమానము,అహంకారము,మమకారము - ఇవి జీవసృష్టి. ఇవి జ్ఞానముతో నశించును.

**జ్ఞానము:-** దీనిని 'విద్య' అందురు. ఇది '2' విధములు.

1) నిత్యము:- ఆత్మ, జీవుడు-వీరు నిత్య జ్ఞాన స్వరూపులు. కనుకనే నడమంత్రముగా అంధులయిన వారికిగాని మామూలు వారికిగాని, స్వప్నము, భావనలలో దర్శన శ్రవణాదులు గలవు. మనస్సులోను గలవు. 'నృత్యశాల'లో

దీపము తనను తనచుట్టు దృశ్యములను తెలుపును. నృత్యములు మొదలైన దృశ్యములు లేనిచో తనే వెలుగును. అనగా తనను తనే వెలిగించుకొనును. అట్లే సాక్షి, స్వయంప్రకాశుడు అయిన 'అత్మ' అహంకారమును బుద్ధిని, విషయములను చూపును. స్వప్నములోని దృశ్యములను చూపును. అదిలేని సుషుప్తి మొదలైన వానిలో తనే వెలుగును.

2) వృత్తి జ్ఞానము:- ఇది జన్యము. మనకు గలుగు జ్ఞానములు అన్నియు వృత్తి జ్ఞానములే. వృత్తి అనునది జడమే. కాని చైతన్యము అనునది దానియందు సోకుటచే అది జ్ఞానమగును - తీగలో విద్యుత్తు వలె. ఈ వృత్తి-2 విధములు.

1) అవిద్యావృత్తి:- జీవసృష్టికి సంబంధించినది. అనగా నిజముగా లేనివి. అంతఃకరణ వృత్తులతో పనిలేని రజ్జుసర్పములు, స్వప్నగుణములు, సుషుప్తిలోని సుఖము, అజ్ఞానము మొదలైనవి.

2) అంతఃకరణవృత్తి:- ఈశ్వరసృష్టికి సంబంధించినది. ఇది '2' విధములు. 1) జాగ్రత్తులోని సుఖదుఃఖాది జ్ఞానము. దీనికి బహిరవయవముల అవసరము లేదు. 2) ఘటాది జ్ఞానము - దీనికి నేత్రము మొదలగు బహిరవయవముల అవసరము కలదు. ఘటముతో అంతఃకరణమునకు సంబంధము ఏర్పడినపుడు అంతఃకరణము 'ఘటాకారము' అగును. ఇదే 'వృత్తి'.

గమనిక:- వివరములు - 'అంతఃకరణము' అను అధ్యాయములో గలవు.

జ్ఞానము - వృత్తి :-

'అహంబ్రహ్మ' అను ఆకారము గల అంతఃకరణవృత్తి జ్ఞానము అజ్ఞానమును నశింపచేయును. జ్ఞానస్వరూపమయిన 'అత్మ' అజ్ఞానమును తానుగా నశింపచేయును. కాని వృత్తి యందు ప్రతిబింబించినచో అజ్ఞానమును తొలగించును. అనగా నోటిలోనున్నంత మాత్రమున మందు రోగమును తగ్గించదు. కరిగినచో తగ్గించును. అట్లే సూర్యకాంతి దహింపదు. కాని 'భూతద్దము' ద్వారా పంపినచో దహించును. ఘటజ్ఞానము ఘటాజ్ఞానమును పోగొట్టును. మహావాక్యముల వలన కలిగిన 'బ్రహ్మకారక వృత్తి' అనగా "బ్రహ్మజ్ఞానము" అజ్ఞానమును పోగొట్టును. జ్ఞానము వలన మనోనాశము. అట్లే అనేక జన్మార్జిత దృఢ జ్ఞానము వలన అంతః కరణ నాశము. కాని వృత్తిజ్ఞానములు అన్నియు ఏదో ఒక కారణముచే పుట్టినవే. జన్య జ్ఞానములు కనుక అజ్ఞానములే, అనిత్యములే. ఘటజ్ఞానము ఘటమున్నంత వరకే ఉండును.

బ్రహ్మజ్ఞానము వృత్తిజ్ఞానమయినను మహావాక్యమువలన జన్మించినను, 'అజ్ఞానము' అనరాదు. అది నిప్పునుంచి నీరువలె విరుద్ధ సంతానముగా పుట్టినది. కనుక నిప్పు నుంచి పుట్టిన నీరు నిప్పును చల్లార్చినట్లు బ్రహ్మాకారవృత్తి జ్ఞానము అజ్ఞానమును పోగొట్టును. తానున్ను నశించును. అద్వైతులు జ్ఞానమునే భక్తి యందురు. 'సోహమ్' అను భావననే 'ఉపాసన' అందురు.

జ్ఞానము మరల రెండు విధములు :-

1. **సవికల్పకజ్ఞానము :-** 'ఘటంజానామి'. దీని యందు 'త్రిపుటి' కలదు. 'ఘటము' ప్రధానాంశము.

2. **నిర్వికల్పకజ్ఞానము:-** తత్త్వమసి. ఇచ్చట 'త్రిపుటి' లేదు. ఒక్కటే విషయము. ప్రమాత మాత్రమే.

**ముక్తి – జీవన్ముక్తి :-**

కర్మలు- ఇవి ఎట్టి పరిస్థితిలోను మోక్షమును ఈయజాలవు. ఎంతలేదనుకొన్నను 'కర్మలు' చేయునపుడు దేహాభిమాన రూపములో కర్తృత్వము తప్పదు. కనుక ఇవి 'పరమేశ్వరార్పణ బుద్ధితో' వైరాగ్యపూర్వకముగా చేయబడినచో 'చిత్తశుద్ధి' ద్వారా జ్ఞానమునకు దారి తీయును. జ్ఞానముననే కైవల్యము. లేదా జ్ఞానమే కైవల్యము.

తత్వము : 'క్షేత్ర, క్షేత్రజ్ఞ, మోక్షములు' అన్నియు మిథ్యయే. జ్ఞానమే ఆత్మ, అంతః కరణము జ్ఞాని. అదియు మిథ్యయే. దానిలోని జ్ఞానము మాత్రమే సత్యము. 'ఆత్మ' స్వరూపము. ఆనందమే బ్రహ్మము. జ్ఞానమే బ్రహ్మము. అదే మోక్షము. దానిని 'పొందుట' అన్నదే లేదు. 'నన్ను నేను తెలిసికొన్నాను' అను వాక్యమున వ్యాకరణపరముగా త్రిపుటి అనగా 'కర్త, కర్మ, క్రియ' ఉన్నవి. అయినను ఇచ్చట కర్మగాని క్రియగాని 'కర్త' లోనే అంతర్భవించును. 'నేను' అను ఆత్మ మాత్రమే మిగులును. అట్లే, 'బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి' అనగా అనుభవమే. అనుభవము జ్ఞానమే. జ్ఞానము ఆత్మయే అట్లే, 'బ్రహ్మసాయుజ్యము' అనగా బ్రహ్మప్రాప్తి ఆనందానుభవము. బ్రహ్మసాయుజ్య ప్రాప్తి అను పదములో సాయుజ్యము, ప్రాప్తి సమానార్థకములు. 'సుఖప్రాప్తి అగుగాక' అను వాక్యములో 'ప్రాప్తి – అగుట' మధ్య తేడా లేదు.

అట్లే బ్రహ్మసాయుజ్య – ప్రాప్తి అనునవి అంతేతప్ప 'దేనినో పొందుట' అన్నది లేదు. 'స్వరూపేణ అవస్థానమ్' అనగా తన నిజస్వరూపము తెలిసికొనుటయే మోక్షము. అనగా ఉన్నది పొందుటయే.

'ప్రాప్తప్రాప్తి-పరిహృతపరిహారము'. మోక్షము అనగా ఈ రెండు విధములుగా వర్ణింపవచ్చును.

1. తన ఇంట్లోనే ఉన్న లంకెబిందెలను హఠాత్తుగా పొందినట్లు, మతిమరుపు వాడు తన మెడలోనే ఉన్న గొలుసుకై ఇల్లంతా వెతికి చివరకు ఎవరో చెప్పగా తనమెడలోనే ఉన్నట్లు గ్రహించి ఆనందించినట్లు, తనలోనే ఉన్న తన నిజ స్వరూపమును మహావాక్యముల ద్వారా, గురువు ద్వారా తెలిసికొనును. ఇది ప్రాప్తప్రాప్తి. ఇది ఆనందమే కదా.

2. అట్లే చీకటిలో కాలికి పూలదండ చుట్టుకొనగా 'పాము' అని భయపడిన వానికి దీపము తెచ్చిన మఱొకతడు " పాముకాదు-పూలదండ " అని చెప్పినపుడు లేని సర్పము తొలగిపోవును. అట్లే మహావాక్యముల వలన లేని సంసారము, జగత్తు, అజ్ఞానము తొలగిపోవును. అనగా ఇది పరిహృత పరిహారము.

మోక్షము సిద్ధమయిన విషయము. అది స్వస్వరూపము. జ్ఞానము వలన బంధనాశము, ఆవరణ నాశము అగును. బంధము అవిద్యాకృతము. అది అంతః కరణరూపమున మనలను బంధించును. బ్రహ్మజ్ఞానము వలన అవిద్య, అంతః కరణము నశించును. మాయ 'బ్రహ్మ'మందు లీనమగును. సర్వభూతములు మాయయందు లీనమగును.

మాయ / అవిద్య అద్దమువంటిది. 'అద్దము' పగిలినచో ప్రతిబింబము నశించునట్లు 'చిదాభాసుడు' నశించును. 'బ్రహ్మము' మిగులును. ఘటము నశింపగా అందలి ఆకాశము మహాకాశముగా అగును, ఏకుండ పగిలితే ఆ కుండలోని 'ఆకాశము' నశించినట్లు ఏ అంతఃకరణము నశించిన ఆ చిదాభాసునకు ముక్తి కలుగును. మనోలయము వలన సంసారము పోవును. అంతఃకరణ లయము వలన చిదాభాసత్వము కూడా పోవును.

**తత్త్వమసి :-**

"న, న" అను వాక్యములతో సర్వ జగత్తును నిషేధము (అపవాదము) చేయగా మాయ తొలగి ఆరోపిత జగత్తు నశించును. దానితో " సర్వం ఖల్విదం బ్రహ్మ" అని తెలియును. శరీరమునందు "అయమాత్మాబ్రహ్మ" అనియు తెలియును. తరువాత 'తత్త్వమసి' అని గురువు బోధించును.

'సోయందేవదత్తః' అను ప్రత్యభిజ్ఞా (Identification) వాక్యము ప్రకారము 'తత్త్వమసి' అను వాక్యము సమన్వయమగును.

'చిన్ననాటి దేవదత్తుడు 50 ఏళ్ళ తర్వాత మరల కనబడును. వానిని

మనము ఎట్లో గుర్తించెదము. కాని ఆనాటికి ఈనాటికి దేవదత్తునిలో చాలా తేడా వచ్చినది. అయినను ఆ తేడాలను ప్రక్కన పెట్టి దేవదత్తుని గుర్తించెదము. అట్లే దేవదత్తుడు రాముని వేషము వేసికొని రంగస్థలము మీదకు వచ్చును. వానిని మనము వేషమును ప్రక్కనబెట్టి దేవదత్తునిగా గుర్తించెదము. అట్లే,

'తత్త్వమసి' అనగా 'ఆ బ్రహ్మమేనీవు' అని అర్థము. అయితే బ్రహ్మమునకు జీవునకు చాలా తేడా గలదు. ఆ తేడాలను ప్రక్కనబెట్టి ఉభయులందలి జ్ఞానము అనగా 'చైతన్యము' ఒక్కటే అని గుర్తించుట జరుగును.

గీతలో 'మమైవాంశః' అని "జీవుడు ఈశ్వరాంశ" అని చెప్పిరి. అనగా ఈశ్వరుని అంశవంటి వాడని అర్థమే కాని ఈశ్వరునిలోని ముక్క అని అర్థము. ఈశ్వరునిలో అంశములు, భాగములు లేవు. కనుక జీవుడు ఈశ్వరుడే. 'అహంబ్రహ్మాస్మి' అను జ్ఞానము కలిగి నిర్వికల్ప సమాధిలో ఈ 'అభేదము' అవగతమయిన మరుక్షణము సమస్త సంశయములు తీరును.

'భిద్యతే హృదయగ్రంధిః – ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి – తస్మిన్ దృష్టే పరావరే.'

ఇట్లు
మేళ్ళచెర్వు వేఙ్కటసుబ్రహ్మణ్య శాస్త్రి,
గోరంట్ల వెంకన్న సంస్కృత కళాశాల,
తిమ్మసముద్రము.

శ్రీః

# అద్వైతామృతమ్

## శ్రీ బెల్లంకొండ రామరాయ కవీంద్ర విరచితమ్

**(1875-1914)**

**శ్లో॥ నత్వా హయగ్రీవపదాంబుజాతమ్**
**ధీ మంథ నిర్మంథిత వేదసింధుః।**
**రామో దదాత్యేత దమత్సరేణా-**
**ద్వైతామృతం భో విబుధా భజధ్వమ్॥**

అనువాదము:- హయగ్రీవ పాదపద్మములకు నమస్కరించి, బుద్ధి అను కవ్వముతో వేద వాఙ్మయమును మథించి, 'రామకవి' యీ 'అద్వైతా మృతమును' మాత్సర్య రహితుడై యిచ్చుచున్నాడు. పండితులారా! దీనిని స్వీకరింపుడు!

1) **నను కథ మద్వైతం దాతుం శక్యతే? దాతృదాన దేయ త్రిపుటీ సత్త్వే అద్వైతత్వహానేః. నచ గ్రంథపరత్వాత్ అదోష ఇతి వాచ్యమ్, గ్రంథేనాపి కథ మద్వైతం ప్రతిపాద్యేత, ప్రతిపాద్య ప్రతిపాదక భావ సంబంధస్యాపి అద్వైతే అయోగాత్** - అయ్యా! అద్వైతమును ఎట్లు ఇవ్వగలరు. అద్వైతమనగా ఒక బ్రహ్మ పదార్థము తప్ప ప్రపంచమున మిగిలిన దంతయు మిథ్య గదా! అట్టి పరిస్థితిలో 'దాత, దానము, దానము చేయబడువస్తువు' అను 'త్రిపుటి' లేదు గదా! ఎవరు ఎవరికి ఏది ఇవ్వవలయును? అద్వైతము దెబ్బతినును గదా! అంతా బ్రహ్మ మయినపుడు '3' అంశములు ఎచ్చటినుండి వచ్చును? గ్రంథము విషయములో దోషములేదని భావింపరాదు. గ్రంథమయినను అద్వైతమును ఎట్లు ప్రతిపాదించును. అట్లయినచో ప్రతిపాదించు గ్రంథము, ప్రతిపాదింపబడు విషయము అను '2' అంశములు తప్పవు

కదా! అద్వైతమన్నచో 'ఒక్కటే' అని కదా! కనుక గ్రంథమయినను అద్వైతమున సాధ్యము కాదు.

2) **కించ అయం గ్రంథకారః స్వయ మద్వైత మనుభూయ దిశతి వా? ఉత అననుభూయ?** – పైగా, గ్రంథకారుడు స్వయముగా అద్వైతమును అనుభవించి ఇచ్చుచున్నాడు? అనుభవింపకయే ఇచ్చుచున్నాడా?

3) **ఆద్యే, కవికర్తృకానుభవ విషయే అస్మిన్ అద్వైతే బలాదపి ద్వైత మాపతతి – దేవదత్త కర్తృకానుభవ విషయాణాం ఘటాదీనాం ఆత్మకర్తృకానుభవవిషయాణాం సుఖాదీనాం చ ద్వైతత్వ దర్శనాత్.** అద్వైతము 'కవి' అనుభవించియే ఇచ్చుచున్నాడనగా, కవి యొక్క అనుభవములలో తప్పక ద్వైతము వచ్చిపడును. దేవదత్తుడు అనుభవించిన ఘటము మొదలగువాని విషయములలోను, తానే అనుభవించిన సుఖాదుల విషయములోను ద్వైతము కనబడుచున్నది. దేవదత్తుడు, ఘటము, తాను, తన సుఖము ఇలా ద్వైతముగలదు గదా! కనుక ఈ పక్షమున అద్వైతము కుదరదు.

4) **ద్వితీయే స్వస్యైవ అవిదితస్య కథం అన్యేభ్యో దానమ్?** – రెండవపక్షమున తనకు అనుభవము లేని అద్వైతమును కవి ఇతరులకు ఎట్లు ఈయగలడు?

5) న చైవం సర్వవేదాంతశాస్త్రస్యాపి అప్రామాణ్యం స్యాదితి వాచ్యమ్, **త్వన్మతరీత్యా అప్రామాణ్యస్య అస్మాక మిష్టత్వాత్. అపిచ అద్వైతవిత్ భవాన్ స్వానుభూత మిద మద్వైతం కస్మై దిశతి? ద్వితీయస్యైవ అభావాత్, సత్వేవా అద్వైతహానేః** – అట్లయినచో సర్వవేదాంత శాస్త్రము అప్రమాణమగును. (కారణము ఏమనగా అనుభవమున్నవాడు చెప్పరాదు. అనుభవము లేనివాడున్ను చెప్పరాదు. వేదాంత శాస్త్రమును ఎవరు చెప్పినను ఈనియమము ప్రకారము అనర్హులే అగుదురు గదా) అని భయపడవలదు. మీ మతము ప్రకారము వేదాంతము అప్రమాణ మగుటయే మాకు (ద్వైతులకు) ఇష్టము. పైగా, అద్వైత వేత్తలయిన మీరు అద్వైతమును ఎవరికి ఇచ్చెదరు? మీకు '2' వ వస్తువే యుండదు గదా! ఉన్నదన్నచో 'అద్వైతము' నిలువదు గదా!

6) **తస్మాత్ అద్వైత మధికృత్య తవ గ్రంథారంభ ప్రవృత్తి రేవ న సంఙాఘటేత - ఇతి ద్వైతినాం పూర్వః పక్షః.** - కనుక 'అద్వైతమును' గూర్చి పుస్తకము వ్రాయుటయే అద్వైతరీత్యా కుదరదు - అని ద్వైతుల పూర్వ పక్షము.

7) **అత్రాహ కశ్చిత్-అద్వితీయ పరమానందరూపోపి పరమాత్మా భగవాన్ కృష్ణః యథా అర్జున దుఃఖాపనోదనాయ గీతాశాస్త్రం ప్రణినాయ తథా కవినాపి సంసార దుఃఖిత శిష్య దుఃఖాపనోదనాయ ప్రణీతోయం గ్రంథ ఇతి** - దీనికి ఒకరు చెప్పిన సమాధానము అద్వైతానంద స్వరూపుడైన కృష్ణపరమాత్మ అర్జున దుఃఖనివారణకు గీతాశాస్త్రము నుపదేశించెను. అట్లే రామకవియును సంసార దుఃఖముతో అల్లాడుచున్న శిష్యుల దుఃఖనివారణకు ఈ గ్రంథము రచించెను.

8) **నన్విద మున్మత్తప్రలపితమ్ - ప్రమాత్రాద్యాత్మక సర్వజగన్నిషేధేన అద్వితీయాత్మనః కృష్ణస్య కవే ర్వా కథం చక్షుషా శిష్యదుఃఖవీక్షణమ్? కథం వా వాచా తస్మై తత్త్వవచనమ్? ఇద మేవాహ హి శ్రుతిః- 'తత్కేన కం పశ్యేదితి' నేహ నానాస్తి కించన, ఐతదాత్మ్య మిదం సర్వమ్ ఇత్యాదిః ఇతి** - అయ్యా! ఇది పిచ్చిమాట! 'ప్రమాత, ప్రమాణము, ప్రమేయము' అను వివిధ రూపములుగల యీ ప్రపంచమంతయు మిథ్యయని, బ్రహ్మము అద్వితీయమని, అఖండమని, ఆ బ్రహ్మము తనే అని ఉన్న కృష్ణుడు కాని, అట్లే అధ్యాత్మస్థితినిపొందిన యీ 'రామకవి' గాని తమ కంటితో శిష్యుని దుఃఖము ఎట్లు చూడగలరు. ఎట్లు వాక్కును ఉపయోగించి శిష్యునకు తత్వము బోధింపగలరు? 'దేనితో దేనిని చూడగలదు, నానా పదార్థములు లేవు ఉన్నది ఒక్కటే, ఇదంతయు పరమాత్మయే, అని వేదములు కూడా చెప్పుచున్నవి కదా! మఱి ఉన్నది ఒక్కటే యైనపుడు ఎవరు ఎవరిని చూచును. ఎవరు ఎవరికి చెప్పును?

9) **ఏవం ప్రాప్తే అపర ఆహ!-యావత్ దేహపాతం యస్య కస్యాపి నాస్తి బ్రహ్మాపరోక్షజ్ఞానమ్. పరోక్ష జ్ఞానేన తు న ద్వైతబాధః, తస్మాత్ కృష్ణాదయః**

సర్వేపి పరోక్షజ్ఞాః పరోక్షమేవ బ్రహ్మ ఉపదిశంతి స్వర్గ మివ - దీని మీద మఱొకడు ఇట్లు అనెను. శరీరనాశము వఱకు అనగా మరణము వఱకు ఎవరికయినను బ్రహ్మజ్ఞానము ప్రత్యక్షముగా గలగదు. అది పరోక్షమే. పరోక్ష జ్ఞానములో ద్వైతమునకు ఇబ్బంది లేదు. కనుక కృష్ణాది అవతార పురుషులు గూడా శరీరధారులు గనుక పరోక్షజ్ఞానము గలవారే! స్వర్గమును గూర్చి చెప్పినట్లు పరోక్షమయిన బ్రహ్మను గూర్చి చెప్పెదరు. అందులో అయుక్తత లేదు.

10) **నను ఏవం స్వర్గాదివాక్యజ్ఞానేన యథా పురుషస్య న స్వర్గాది సౌఖ్యమ్ తథా తత్త్వమస్యాది వాక్యజ్ఞానేనాపి న బ్రహ్మానుభవానందః, నాపి దుఃఖ నివృత్తిః, కించ 'స్వయం తీర్ణః పరం తారయే' దితి న్యాయాత్ స్వత ఏవ అనివృత్త దుఃఖస్య కృష్ణాదేః అర్జునాది దుఃఖనిరాసాయ ప్రవృత్తిః అపహాసాస్పదైవ** - ఈ విధముగా 'స్వర్గాది' వాక్యములను వినినంత మాత్రమున స్వర్గసౌఖ్యములు లభించనట్లు 'తత్త్వమసి' అను వాక్యమును తెలిసికొన్నంత మాత్రమున బ్రహ్మానందము లభింపదు గదా! దుఃఖములు పోవుగదా! పైగా 'తాను తరించి యితరులను తరింప జేయవలయును' అని న్యాయము గదా! మఱి సంసారములోనేయున్న, సంసారదుఃఖములలోనున్న, కృష్ణుడు మొదలగువారు అర్జునాదుల దుఃఖములను పోగొట్టుటకు ప్రయత్నించుట పరిహాసాస్పదము కదా!

11) **న చ పరోక్షాదపి బ్రహ్మజ్ఞానాదస్తి పరమానందలాభః ఇత్యభినివేశః కార్యః-'శబ్దబ్రహ్మణి నిష్ణాతః న నిష్ణాయాత్ పరే యది. శ్రమస్తస్య శ్రమఫలో హ్యా ధేను మివ రక్షతః' ఇతి భాగవతాత్** - పరోక్షమయిన జ్ఞానమువలన గూడా అనగా 'తత్త్వమసి' అను వాక్యము యొక్క అర్థమును గ్రహించుట వలన గూడా - పరమానందము కలుగును అని వాదింపవలదు. కేవలవాక్యజ్ఞానము నిరుపయోగమని భాగవతము చెప్పినది. చూ॥ 'శబ్ద బ్రహ్మయందు (వాక్యమునందు) నిష్ణాతుడైనవాడు పరబ్రహ్మయందు నిష్ణాతుడు కానిచో అతని శ్రమకు ఫలితము శ్రమయే. పాడి అవును గాక మఱొక దానిని ఎంత పిండినను 'అవుపాలు' రావు గదా! కనుక కేవల శబ్ద (వాక్య) జ్ఞానము వృథా అగును.

12) **అపిచ నిత్యముక్తస్య నిత్యా పరోక్ష బ్రాహ్మణః అస్థలిత బ్రహ్మచారిణః ఈశ్వరస్యాపి కృష్ణస్య యది యావ ద్దేహపాతం సంసారః కిం పున రన్యస్యేతి విరుద్ధ మిదం తవ వచనమ్.** - మఱియు, నిత్యముక్తుడు నిత్య బ్రహ్మానందానుభవశాలి, అస్థలిత బ్రహ్మచారి అయిన ఈశ్వరుడు అయిన కృష్ణునకు గూడా దేహపాతము దాకా 'సంసారము' తప్పనిచో ఇంక ఇతరుల గురించి చెప్పవలసిన దేమి? కనుక నీ వచనము విరుద్ధముగా నున్నది.

13) **తథాహి, అయ మాత్మా అపహత పాప్మా విజరో విమృత్యుః విశోకః ఇత్యాదినా ఈశ్వరస్య నిస్సంసారత్వం శ్రూయతే, తదైక్య జ్ఞానేన చ జీవానాం ముక్తి రితి భవన్మతమ్** - 'ఆత్మకు పాపములులేవు. ముసలితనము లేదు మృత్యువు లేదు శోకము లేదు' మొదలగు వేదవాక్యములవలన ఆత్మరూపుడైన ఈశ్వరునకు సంసారములేదు అని తెలియుచున్నది. అట్టి యీశ్వరునితో ఐక్య జ్ఞానము వలన జీవులకు ముక్తి అని నీ మతము.

14) **అధునా తు కృష్ణైక్య జ్ఞానేన అర్జునస్యాపి సంసార ఏవ పునః ప్రాప్తః న తు ముక్తిః. కించ దేహపాతానంతరం ఆత్మ సాక్షాత్కారః భవతీతి వదతా భవతా కిమాత్మ సాక్షాత్కారః ఆత్మనః అన్యత్వేన వివక్షితః? యద్వా అనన్యత్వేన?** - కాగా, కృష్ణునకు గూడా దేహపాతమువఱకు సంసారమే అని తేల్చితివి. మఱి యీ కృష్ణునితో ఐక్య జ్ఞానము వలన అర్జునునకు ఒరిగినదేమి? సంసారమే గదా! మఱల వచ్చిపడినది. మోక్షము రాలేదు. మఱియు, దేహపాతము తర్వాత 'ఆత్మ సాక్షాత్కారము' జరుగునని నీవు చెప్పితివి. 'ఆత్మ' సాక్షాత్కారము అనగా నేమి? వేఱే మఱొక పదార్థము ఏదైనను, దర్శనమిచ్చునా లేక తనకు తన తత్త్వమే సాక్షాత్కరించునా?

15) **ఆద్యే-యః ఆత్మానం సాక్షాత్కుర్యాత్ తస్య విద్యమానత్వేన కథం అద్వైతత్వ మాత్మనః? ద్వితీయే సాక్షాత్కారపద వైయర్థ్యమ్. న చైవం దేహపాతానంతర మాత్మా భవతీతి వదామః ఇతి వాచ్యమ్, ఆత్మాపరోక్ష**

**జ్ఞాన స్యైవ క్వాప్యసంభవాత్ సమూలోచ్ఛేదః. తస్మాత్ దేహపాతానంతరం బ్రహ్మాపరోక్షజ్ఞానం భవతీత్యుక్తిః అయుక్తా.** - మొదటి పక్షమయినచో, ఆత్మ విడిగానున్నట్లు తేలును కనుక 'అద్వైతమే' లేదు. ఆత్మ అద్వితీయము కాదు. దానిని దర్శించువాడు అగు ఆత్మజ్ఞానియున్నట్లే కదా! రెండవ పక్షమయినచో తనను తానే ప్రత్యక్షముగా చూచికొనుట సాక్షాత్కారము ఎట్లగును? దేహపాతానంతరము జీవుడు 'ఆత్మ' గా అగును అని చెప్పినను కుదరదు. 'ఆత్మ' యొక్క అపరోక్ష జ్ఞానమే అసంభవము గదా! బ్రతికియుండగా తెలియని యీ జ్ఞానము సంభవమనియెట్లు తేలును. కనుక దేహపాతము తరువాత బ్రహ్మజ్ఞానము అపరోక్షానందము కలుగును అనుట యుక్తము కాదు.

16) **ఏవం ద్వైతే సిద్ధాంతితే సతి బ్రూమః-కేన కం పశ్యేది త్యాది శ్రుతిః 'స్వాప్యయసంపత్త్యోః' ఇతి సూత్రేణ సుషుప్తి ముక్త్యన్యతర విషయేతి స్ఫుటీకృతా వ్యాసపాద్యైః. సుషుప్తి విషయా ముక్తి విషయా వా శ్రుతిస్త్వితి విద్యారణ్యై శ్చోక్తమ్** - ఇంతవఱకు ద్వైతుల సిద్ధాంతము చెప్పబడినది. దీనిపై అద్వైతవాదుల సమాధానము. 'కేన కం పశ్యేత్' అను శ్రుతి (-దేనితో దేనిని చూడగలడు-అని ఓ.ని అర్థము) 'స్వాప్యయసంపత్త్యోః అను బ్రహ్మ సూత్రము ప్రకారము సుషుప్తికి, ముక్తికి సంబంధించినదిగా వ్యాసులు చెప్పిరి. అనగా సుషుప్తిలో, ముక్తిలో 'ఆత్మ' మాత్రమే మిగులును కనుక త్రిపుటి నశించును. దేనితో దేనిని చూడగలడు? అని శ్రుతి చెప్పినట్లు అర్థము. విద్యారణ్యులు గూడా ఆ శ్రుతి సుషుప్తికి లేదా ముక్తికి చెందినదనియే చెప్పిరి.

17) **తస్మాత్ పరమార్థ దశాయామేవ సర్వజగన్నిషేధః, వ్యవహారతస్తు ప్రమాత్రాది సర్వద్వైత మస్తి. తథా ప్రతిపాద్య ప్రతిపాదక భావోపి అస్తి ఆత్మనః. న చేదం వ్యావహారికం ద్వైతం పారమార్థికస్య అద్వైతస్య ఆత్మనః అద్వైతత్వం బాధితుమీష్టే. పరమార్థతః ద్వైతస్య అభావాత్** - కనుక పరమార్థ దశలోనే అనగా సుషుప్తి/సమాధి/ముక్తి దశలో మాత్రమే సర్వజగత్తు అదృశ్యమయి బ్రహ్మమాత్ర జ్ఞానము కలుగును.

వ్యవహారరీత్యా మాత్రము ప్రమాత, ప్రమేయము, మొ॥ ద్వైతరూప మయిన ప్రపంచ వ్యవహారమంతయు కలదు. ఆ విధముగా ఆత్మను వ్యవహారదశలో చర్చించవచ్చును. ప్రతిపాదించవచ్చును. వ్యవహారము లో కనబడు నీ ద్వైతము. పారమార్థికమయిన అనగా వాస్తవమయిన 'బ్రహ్మ'ను బాధింపదు. అందువలన ఆత్మకు 'అద్వైతము' భంగము కాదు. ఏమంటే వాస్తవముగా 'ఉన్నది' ఒక్కటే కనుక. (రజ్జువును చూచి సర్పము అనుకున్నంత మాత్రమున, మనము దడిసికొన్నంత మాత్రమున 'రజ్జువు' సర్పముగా మాఱదు కదా)

18) **ఇదం చాద్వైతం బ్రహ్మ అఖండాకారయా, వృత్త్యా వేద్యత ఏవ. తదేవ వేదన మాత్మ సాక్షాత్కార ఇత్యుచ్యతే. అనయా చ వృత్త్యా తదద్వైతామృతం బ్రహ్మ అనుభూయైవ వదతి కవిః,ఇతి సిద్ధమేవ అద్వైతామృతదాన మస్య (అత్రదానం నామ ప్రతిపాదనమేవ ఇతి బోధ్యమ్)**-అఖండాకారమయిన వృత్తితో ఈ అద్వైత అఖండ బ్రహ్మ జ్ఞానగోచరమగును. ఈ జ్ఞానమే 'ఆత్మ సాక్షాత్కారమని' చెప్పబడును. ఇట్టి వృత్తితోనే అద్వైతామృత స్వరూపమయిన 'బ్రహ్మను' అనుభవించియే 'కవి' ఈ అద్వైతామృతమును దానము అనగా ప్రతిపాదనమును చేయుచున్నాడు.

19) **నచైవం త్రిపుటీసత్త్వం ఆత్మనః-పరమార్థతః దానాద్య సంభవాత్. న చ కవి విదిత మిద మద్వైతం విదితత్వాత్ ద్వైతమేవ ఇతి వాచ్యమ్. 'అన్యదేవ తద్విదితాత్ అథో అవిదితాత్' ఇతి శ్రుతేః. విదితా విదితాభ్యాం అన్యదప్యద్వైతం వ్యవహారతః అఖండాకార వృత్త్యా విదితమివ భాతి, నతు వస్తుత ఇతి న సుఖాది తౌల్య మస్య.** - దీనివలన 'తీసికొనువాడు ఇవ్వబడేది ఇచ్చేవాడు' అను త్రిపుటి రాదు. ఏమనగా వాస్తవముగా 'దానము చేయుట' అనునది ఆత్మ విషయములో సంభవము కాదు కనుక. మఱియు 'కవి అద్వైతమును తెలిసికొన్నాడు' కనుక ఈయన అద్వైతములో 'త్రిపుటి' కలదుకనుక (అనగా తెలిసికొనువాడు, తెలియ జేయువాడు, తెలియబడునది) ఇది ద్వైతమే అని చెప్పరాదు. ఏమనగా అది అనగా అద్వైత తత్వము 'తెలియబడుట, తెలియబడకపోవుట'

అను రెండిటికన్న భిన్నమయినదని వేదము. కనుక అద్వైతము విదితము కాదు. అవిదితము కాదు. కాని వ్యవహారమునకు సంబంధించి నంత వరకు అఖండాకారమయిన అంతఃకరణవృత్తితో 'అద్వైతము' తెలియ బడినట్లే అనిపించును. నిజమునకు సుఖాదులవలె ఇది విదితము కాదు.

20) **తస్మాత్ సమాధ్యాదిషు కవిః అద్వితీయ మాత్మానంద మనుభూయ వ్యవహారకాలే శిష్యాచార్యాది సర్వద్వైత సత్త్వాత్ జిజ్ఞాసు జన త్రాణార్థం స్వానుభవసిద్ధం సర్వవేదాంతసిద్ధం చ ఇద మద్వైతామృతం గ్రంథరూపేణ ప్రతిపాదయతీతి న కశ్చిత్ దోషః.** –కనుక సమాధి మొ॥ వానియందు కవి అద్వితీయమయిన ఆత్మానందమును అనుభవించి, వ్యవహారకాలమున గురు శిష్యులు అను ద్వైతమున్నది కనుక జిజ్ఞాస గలవారి ప్రయోజనమునకై స్వానుభవము జోడించి వేదాంతశాస్త్ర ప్రసిద్ధ మయిన ఈ అద్వైతామృతమును గ్రంథముగా తెచ్చుచున్నాడు. కనుక ఇందులో అద్వైతమునకు వచ్చిన దోషము లేదు.

21) **నను అవాఙ్మానస గమ్యం తత్ అద్వైతం కథం బోధయితుం శక్యేత? ఇతి చేత్ సత్యమ్. 'ఇద మద్వైత మీదృశమ్' ఇతి 'అయం ఘటః' ఇతి వత్ న బోధయేత్, కింతు ద్వైత విలక్షణత్వం బ్రహ్మణః బోధయేదితి** – అయ్యా, అద్వైతము వాక్కులకు మనస్సునకు అందనిది గదా! దానిని వాక్కులతో బోధించుట యెట్లు? మనస్సుతో తెలిసికొనుట ఎట్లు? అనగా నిజమే, 'ఇదుగో కుండ' అని చూపినట్లు 'ఇదిగో అద్వైతము ఇట్లా ఉంటుంది' అని చూపుట సాధ్యము కాదు. కాని కనబడే ద్వైతము కన్న 'అద్వైతము' భిన్నము అని చెప్పవచ్చును.

22) **నను యద్యేవం గ్రంథారంభసమర్థనాయ భవతా వ్యవహారతః సర్వం అభ్యుపేయతే తర్హి గ్రంథప్రతిపాద్యాభావాత్ గ్రంథారంభాభావః ఇతి వయం బ్రూమః** – అయ్యా, మీ గ్రంథ ప్రారంభాన్ని సమర్థించుకొనుటకు మీరు వ్యవహారరీత్యా సమస్త జగత్తును అంగీకరించినచో, ఆ పక్షమున మీ గ్రంథమునందు చెప్పవలసిన విషయము లేదందుము. అందుచే మీ గ్రంథమును ప్రారంభించుట వ్యర్థము అందుము.

23) **తథాహి, గ్రంథప్రతిపాద్యం అద్వైతం ద్వైతరహిత మిత్యర్థః ఇదం తు ద్వైతం న కదాపి విరమతి ప్రలయేప్యస్య సత్వాభ్యుపగమాత్. అన్యథా వినాపి జ్ఞానం ప్రలయే సర్వముక్తి ప్రసంగాత్. కిం పున స్సుషుప్తౌ?, ఆత్మరూపస్యైవ మోక్షత్వాత్ ముక్తిః అద్వైతమేవ-ఇతి కృత్వా ముక్తా వద్వైత మస్తీతి దుర్వచమ్. తస్మాత్ నాస్త్య ద్వైతమితి కశ్చిత్ పదార్థః యమాశ్రిత్య ప్రకృత గ్రంథః ప్రవర్తేత - ఇతి చేత్** - మీ గ్రంథములో చర్చించునది అద్వైతము కదా! అనగా 'ద్వైతము' లేనిది. ఈ 'ద్వైత' భావన శాశ్వతము. ఇది ప్రలయమునందున్ను తొలగదు. 'తొలగును' అని అన్నచో అందఱికి అప్రయత్నముగా మోక్షము లభించును. సుషుప్తి సంగతి చెప్పవలసిన పనిలేదు. 'ఆత్మ' రూపమే మోక్షము కనుక, మోక్షమే అద్వైతము కనుక, 'ముక్తిలో అద్వైతము' అను మాట కుదరదు. కనుక 'అద్వైతము' అను పదార్థమే లేదు. కనుక దానిని గూర్చి 'పుస్తకము' వ్రాయుట వ్యర్థము.

24) **మైవమ్, సర్వదాపి అద్వైత మేక మేవ అస్తి, ద్వైతం తు న కాల త్రయేపి రజ్జుసర్పవత్** - అలాకాదు, సర్వకాలసర్వావస్థలయందును ఉన్నది 'అద్వైతము' ఒక్కటే. ద్వైతము '3' కాలములందును లేదు. రజ్జు సర్పము వలె (అనగా రజ్జువు వాస్తవము దానిపై భ్రాంతితో చూడబడు సర్పము '3' కాలములందును అసత్యము కదా!)

25) **నను ప్రత్యక్షాది ప్రమాణ సిద్ధస్య ద్వైతస్య కథ మభావః ప్రతిపాద్యత ఇతి చే దత ఏవాస్య ప్రాతీతికత్వం అభ్యుపగచ్ఛామః-యథా రజ్జౌ కాలత్రయేపి అవిద్యమానః ఫణీ కదాచిత్ ప్రతీయతే తద్వత్?**-అయ్యా! ప్రత్యక్షముగా కనబడే ద్వైతము లేదని ఎలా ప్రతిపాదించెదవు. కనబడుచున్న దానిని కాదనుటయేమి న్యాయము? అని ప్రశ్న. ప్రతీయమానమగుచున్నది మాత్రమే యిది. అనగా లేకపోయినను ఇది అనగా ప్రపంచము తోచుచున్నది. ఎలాగనగా, 'రజ్జువు' నందు 'సర్పము' ఏనాడున్ను లేదు. ఏ కాలమునను లేదు. కాని మనకు ఒకసారి ఉన్నట్లు అనగా చీకటిలో త్రాడు, పాములె కనిపించినది గదా! అట్టిదే యీ ప్రపంచము.

26) **తతశ్చ ప్రతీతి (వ్యవహార) మాత్రశరణ మేవేదం ద్వైతమ్, నతు సత్యమ్, భ్రాంతి సిద్ధత్వాత్ ఇతి కృత్వా ప్రాతీతిక మిదం జగత్ కదాచిదపి అద్వైతే బ్రహ్మణి నాస్తి రజ్జౌ సర్పవత్** - కనుక ద్వైతరూపమయిన యీ ప్రపంచమంతయు కేవలము మనకు అట్లా అనిపించుటయే (ప్రతీతి) తప్ప సత్యముగా నున్నది కాదు. భ్రాంతి మాత్రమే. అందువలననే అఖండమయిన, అద్వైతమయిన, బ్రహ్మమునందు ప్రతీయమానమయిన యీ ప్రపంచము ఆ బ్రహ్మమునందు వాస్తవముగా లేనే లేదు. ఉదాహరణకు రజ్జువు=బ్రహ్మము, సర్పము=ప్రపంచము (చీకటిలో మనము భ్రాంతిపడినపుడు రజ్జువు (త్రాడు) సర్పము వలె కనబడును. ఇది ప్రతీతి తప్ప వాస్తవముగా సర్పము లేదు. ఉన్నది రజ్జువు మాత్రమే)

27) **తస్మాత్ అద్వైతమేవాస్తి, ద్వైతమేవ నాస్తీతి,** న గ్రంథస్యాస్య ప్రతిపాద్యా **భావః. ఏతేన సుషుప్త్యాదిషు వ్యవహారాభావాత్ ద్వైతాభావః, జాగ్రదాదిషు తు వ్యవహార సత్త్వాత్ ద్వైతభ్రాంతి రితి సిద్ధమ్** - కనుక అద్వైతమే ఉన్నది. ద్వైతమే లేనిది. అంతమాత్రమున ఈ గ్రంథమునకు చర్చనీయాంశము లేకుండ పోదు. సుషుప్తి మొదలైన వానియందు వ్యవహారము లేదు కనుక 'ద్వైతము' లేదు. 'ఆత్మ' ఒక్కటే యుండును. కాని 'జాగ్రత్తు' లో వ్యవహారము ఉండుటవలన ద్వైతము ఏర్పడును. అది భ్రాంతియే అని తేలినది.

28) నను నిష్ఫలోయం గ్రంథారంభః-అద్వైతే అత్మని ప్రతీయమాన మిదం ద్వైతం యది విద్యానివర్త్యం తర్హి కవేః స్వవిద్యయా స్వాత్మ సంసారః యదా నివృత్తః తదా అన్యేషామపి నివృత్త ఏవ-స్వాత్మనః ఏకస్యైవ సర్వశరీరేషు వర్తమానత్వాత్ అద్వైతస్య చ ఏకరూపత్వాత్. **తథా నివృత్త సంసారాణాం తేషాం కిమనేన గ్రంథేన. అథ యది అనివర్త్యం తర్హి బ్రహ్మవిద్యా ప్రతిపాదకోయం గ్రంథః సంసార నివర్తకత్వాత్ వ్యర్థ ఏవ ఇతి చేత్.** - అయ్యా! ఏమయినను ఈ గ్రంథము రచించుట వ్యర్థమే. అద్వితీయమయిన ఆత్మయందు తోచుచున్న యీ ప్రపంచము అంతయు

(రజ్జువునందు సర్పము వలె) మన 'విద్య' అనగా జ్ఞానముతో నివర్తించును. కవిగారి సంసారము కవిగారి జ్ఞానముతో నివర్తింపగా అపుడు ఇతరుల 'సంసారములు' ద్వైతము గూడా ఏకకాలములో నివర్తించును. ఏమనగా సమస్త శరీరములందు ఒక్క ఆత్మయే ఉన్నది కనుక, చైతన్యమంతయు ఒక్కటే కనుక. అవిధముగా 'సంసారనివృత్తి' అయిన జీవులకు ఇంక నీ గ్రంథమెందుకు? ఒకవేళ కవిగారి అనుభవము వలన సంసారము నివర్తింపక పోతే బ్రహ్మ విద్యా ప్రతిపాదకమయిన యీ గ్రంథము జీవుల సంసారమును నివర్తింప జేయలేదు కనుక వ్యర్థమే కదా!-అంటే;

29) **మైవమ్, ఏకోప్యాత్మా యత్ర శరీరే యయా అవిద్యయా ఆవృతః విక్షిప్తశ్చ తత్ర విద్యయా అవిద్యా నాశే సంసారశూన్యః భవతి, న తు అన్యత్రేతి. న చ ఏకైవ అవిద్యేతి వాచ్యమ్, 'ఇంద్రో మాయాభిః-' ఇతి శ్రుత్యా నానాత్వాత్ అవిద్యానామ్** - అట్లు కాదు. 'ఆత్మ' ఒక్కటే అయినను ఏ శరీరమునందు ఏ అవిద్యతో 'ఆత్మ' ఆవరింపబడినదో విక్షిప్తమయి యున్నదో అచ్చట విద్యతో అవిద్య నాశనమగును. దానితో 'ఆత్మ' సంసారరహితమగును. అంతే తప్ప ఒకరి జ్ఞానముతో మఱొక శరీరములోని 'ఆత్మ' విముక్తి పొందదు. (ఒక ఘటము పగిలి అందలి ఆకాశము విముక్తమయినచో సర్వఘటములు పగలవు వానియందలి ఆకాశము విముక్తము కాదు)-అవిద్య ఒక్కటే కదా! అది ఒకచోట పోయినచో అంతటను పోదా? అని భావింపరాదు. 'ఇంద్రుడు మాయలతో అనేక రూపములుదాల్చును' అని వేదము చెప్పినది కదా! కనుక మాయలు అనేకము తద్వారా రూపములు అనేకము. (మాయలు అనగా అవిద్యలే)

30) **నన్విద మతీవ చిత్రమ్ - యదేకస్త్యైవ అపరిచ్ఛిన్నస్య ఆత్మనః తచ్ఛరీరాదిభిః పరిచ్ఛేదః, తతః ఏకస్మిన్ అంశే ముక్తిః అన్యస్మిన్ సంసారః ఇతి చేత్** - అయ్యా! ఇది మఱీ విచిత్రముగానున్నది. 'ఆత్మ' అఖండము, అపరిచ్ఛిన్నము గదా! మఱి దానికి శరీరాదులతో పరిచ్ఛేదము ఎట్లు

జరుగును. పైగా ఒక భాగమునకు ముక్తి మఱొక భాగమునకు సంసారము ఎట్లు కుదురును?

31) **నాయం దోషః, కింతు గుణ ఏవ అస్మాకమ్ ఇంద్రజాలవత్ స్వప్నవచ్ఛ శరీరాది ద్వైతస్య బంధముక్త్యోః తత్సాధనాది ప్రయాసస్య చ ఆత్మభిన్నస్య సర్వస్య మిథ్యాత్వాత్. 'న విరోధో న చోత్పత్తిః న బద్ధో న చ సాధకః న ముముక్షుః న వై ముక్తః ఇత్యేషా పరమార్థతా' ఇతి శ్రుతేః** - ఇది అద్వైతమునకు దోషము కాదు. పైగా గుణమే. 'గారడీ' వలె, 'స్వప్నము' వలె, అన్నియు మిథ్యయే. శరీరములు మొదలైన ద్వైతము, బంధము, ముక్తి, బంధకారణములు, ముక్తిసాధనములు అన్నియు 'ఆత్మ' కన్న భిన్నములే. కనుక మిథ్యలే. వేదమున్ను ఇట్లే చెప్పుచున్నది. 'బంధము లేదు. జన్మయులేదు. బద్ధుడులేడు, సాధకుడు లేడు, ముక్తికాముడు లేడు ముక్తుడు లేడు,-ఇదే వాస్తవము'.

32) **న చైవం వ్యవహారతోపి ముక్త్యనుపపత్తిః, అపరిచ్ఛిన్నోపి ఆత్మా మాయయా బుద్ధిపరిచ్ఛిన్న ఇవ, యథా ఆకాశో ఘటపరిచ్ఛిన్నః అమీషాం పరిచ్ఛిన్నానాం ఆత్మత్వేన ఐక్యేపి పరిచ్ఛిన్నత్వేన అనేకత్వమేవ** - వ్యవహారరీత్యా 'ముక్తి' అనునది ఉన్నది. అఖండమయిన ఆత్మ మాయా కారణముగా బుద్ధివలన 'ఖండములు' లాగా అయినది. ఆకాశము అఖండమయినను కుండలను బట్టి 'ఖండములుగా' అయినట్లు కనబడుచున్నది. ఈ ఖండములు 'ఆత్మ' గా ఒక్కటే అయినను పరిచ్ఛేదములను బట్టి అనేకత్వము వచ్చినది.

33) **తతః ఏకస్య పరిచ్ఛిన్నస్య స్వోపాధి బుద్ధివశేన ముక్తత్వేపి నాపరస్య ముక్తిః, తద్బుద్ధ్యనపాయాత్ ఇతి. యథా ఏకస్మిన్ ఘటే భగ్నే తదాకాశస్య మహాకాశసాయుజ్యలాభేపి నాన్యఘటావచ్ఛిన్నాకాశస్య - తద్వత్. అతః ఆత్మని ప్రతీయమానస్య బుద్ధ్యాదిద్వైతస్య విద్యానివర్త్యత్వాత్ సఫలోయం గ్రంథారంభః** - కనుక ఒక ఖండరూప అంతఃకరణ యుక్త జీవుడు తన అంతఃకరణము తన బుద్ధి-వీనిని బట్టి ముక్తి చెందును. అయినను దానివలన వేఱొక జీవునికి ముక్తిరాదు. ఏమనగా వాని బుద్ధి వేఱుగా

నున్నది కనుక. ఎలా అంటే ఒక కుండ పగులగా దానిలోని ఆకాశము మహాకాశముతో కలిసిపోవును. కాని అంతమాత్రమున వేఱొక కుండలోని ఆకాశము ముక్తి పొందదు గదా! కనుక బుద్ధి మొదలగు వానివలన ఆత్మయందు కనబడుచున్న ద్వైతము జ్ఞానమువలన తొలగును. అందుకు ఈ గ్రంథము అవసరమే. కనుక గ్రంథారంభము సార్థకము.

34) **నను 'విద్యయా ద్వైతం నివర్తతే' ఇతి ఉక్తి రయుక్తా - ఘటజ్ఞానేన ఘటనివృత్త్య దర్శనాత్. యది శ్రీశంకరాచార్యాదీనా మేవం విద్యయా ద్వైత నివృత్తిః ఆసీత్ తర్హి ద్వైతదర్శనాభావాత్ తైః భాష్యాది గ్రంథాః నాక్రియంత. అతః పునరపి గ్రంథారంభానుపపత్తి రేవ. అథ యది న నివర్తతే తర్హి గ్రంథోఽయం నిష్ఫల ఏవ ఇతి చేత్**-అయ్యా! 'విద్య చేత(జ్ఞానము చేత) ద్వైతము(సంసారము) నివర్తించును' అనుట తప్పు. ఘటమును తెలిసికొనగా ఆ ఘటము నివర్తించుట లేదు గదా! ఈ విధముగా విద్యవలన శ్రీశంకరాచార్యాదులకు ద్వైతము నివర్తించినచో వారి భాష్యము మొదలగు గ్రంథములు వ్రాసియుండరు గదా! కనుక ఎలాగున చూచినను ఈ గ్రంథము వ్రాయుట హేతుబద్ధము కాదు. 'ద్వైతము విద్యచేత పోదు' అనే పక్షమున గూడా గ్రంథము అనవసరమే.

35) **మైవమ్, ద్వివిధా విద్యా-పరోక్షా అపరోక్షా చేతి. తత్ర పరోక్షా సర్వదా వర్తతే, న తు తయా ద్వైతం బాధ్యతే. అపరోక్షాతు నిర్వికల్పక సమాధా వేవ వర్తతే, తయా తు ద్వైతం బాధ్యతే. స తు సమాధిః న సర్వదా వర్తత ఇతి న గ్రంథారంభానుపపత్తిః** - అలా కాదు. విద్య రెండు విధములు. 1) పరోక్ష, 2) అపరోక్ష. ఇందు 'పరోక్ష' విద్య ఎల్లపుడును ఉండును. దానివలన ద్వైతము బాధింపబడదు. అపరోక్ష విద్య 'నిర్వికల్పక సమాధియందే ఉండును. దీని వలన 'ద్వైతము' బాధింపబడును. అయితే యీ సమాధి ఎల్లపుడున్ను ఉండదు. కనుక 'పరోక్ష విద్య' అయిన గ్రంథమును అరంభించుటకు ఇబ్బంది లేదు.

36) **తథా ద్వైత బాధోఽపి ద్వివిధః. ద్వైతస్య అప్రతీతిః మిథ్యాత్వనిశ్చయ**

**శ్చేతి. తత్ర ద్వైతాప్రతీతిః అపరోక్ష విద్యయా భవతి. ఇతరస్తు పరోక్షయా. గ్రంథస్తు విద్యాద్వయస్యాపి హేతు రేవేతి న గ్రంథనైరర్థక్యమ్.**

అంతేగాక, ద్వైతము బాధింపబడుట గూడా '2' విధములు.

1) ద్వైతము తోచకుండుట (అప్రతీతి), 2) ద్వైతము మిథ్య అని నిశ్చయ జ్ఞానము. మొదటిది అపరోక్ష విద్య వలన సమాధి మొదలగు వానియందు జరుగును. రెండవది 'పరోక్ష విద్య' వలన జరుగును. ఈ గ్రంథము వలన ముందు పరోక్ష విద్య, తరువాత అపరోక్ష విద్యలభింపగలదు. అందువలన గ్రంథారంభము లాభకరమే.

37) **నచ ఘటజ్ఞానేన ఘటబాధాభావాత్ విద్యయా ద్వైతనివృత్తిః అయుక్తా ఇతి వాచ్యమ్. నాస్మాభిః ద్వైతజ్ఞానేన ద్వైతం బాధ్యత ఇత్యుక్తమ్, తర్హి ఘటజ్ఞానేన ఘటబాధః స్యాదిత్యాపత్తిః దీయేత, కింతు బ్రహ్మజ్ఞానేన ద్వైతం బాధ్యత ఇతి వదామః, అతః నానుపపత్తి రితి. నచ బ్రహ్మజ్ఞానేనాపి కథం ద్వైతబాధ ఇతి వాచ్యమ్. ద్వైతాద్వైతజ్ఞానయోః విరోధాత్ రజ్జు సర్పజ్ఞానయోరివ** - ఇంతకు ముందు మీరు 'ఘటజ్ఞానము చేత ఘటము లేకుండ పోదుగదా అట్లే విద్య (జ్ఞానము) వలన ద్వైతమెట్లు పోవును? 'అని ప్రశ్నించితిరి. కాని మేము 'ద్వైత జ్ఞానము చేత ద్వైతము పోవును' అని చెప్పలేదు. అట్లు చెప్పినచో మీరు పై ప్రశ్నవేసి మావాదమును తప్పుపట్టవచ్చును. కాని అద్వైత జ్ఞానము చేత అనగా బ్రహ్మజ్ఞానముచేత ద్వైతము అనగా సంసారము బాధింపబడునని మాత్రమే చెప్పితిమి. ద్వైత-అద్వైత జ్ఞానములు, లేదా, బ్రహ్మ-సంసార జ్ఞానములు పరస్పర విరుద్ధములు గనుక అద్వైత జ్ఞానము చేత ద్వైత జ్ఞానము నివర్తించును. రజ్జుజ్ఞానము చేత సర్ప జ్ఞానము నివర్తించును గదా!

38) **నను ఆత్మతత్త్వ సాక్షాత్కార నివృత్తాజ్ఞానస్య శంకరాచార్యాదేః నిర్విశేష చిన్మాత్రాత్మని శిష్యాద్యధ్యాసకారణ భూతాజ్ఞాన నాశాత్ శిష్యాద్య ధ్యాసనాశేన కథం శిష్యోద్దిధీర్షయా గ్రంథకరణే ప్రవృత్తిః ఇతిచేత్** - అయ్యా! ఆత్మతత్వమును దర్శించుటచే శంకరాచార్యాదులకు అజ్ఞానము

నివృత్తి అయినది. దానివలన అఖండనిర్గుణ జ్ఞానస్వరూపమయిన 'ఆత్మ' యందు వారికి 'శిష్యాధ్యాస' అనగా 'వీరు శిష్యులు' అనుభావన రాదు గదా! అధ్యాస కారణమయిన అజ్ఞానము నశించెను కదా. మఱి వారు శిష్యులను ఉద్ధరించుటకు గ్రంథములు వ్రాయుట యేల? అని ప్రశ్న.

39) **ఉచ్యతే, కృతాత్మ సాక్షాత్కారస్యాపి యావద్దేహపాతం దగ్ధపటవత్ అజ్ఞాన మబంధకం సత్ వర్తతే ఏవ. తతో ద్వైతప్రతీతి రితి, పరమార్థదశాయా మేవ అజ్ఞానస్య సర్వాత్మనా నివృత్తిః. అన్యత్ర తు సమాధ్యాదౌ తస్య శక్తి సంకోచః ఏవ-ఇతి సిద్ధాంతాత్, యావద్వ్యవహార మీశ్వరచైతన్య స్యాపి అజ్ఞానావచ్ఛిన్నత్వాత్. న చైవం జ్ఞానా దజ్ఞాననివృత్తిః ఇత్యయుక్త మితి వాచ్యమ్. జ్ఞానాత్ ముక్తి లాభే సతి అజ్ఞాన నాశః ఇతి వివక్షితత్వాత్**
- చెప్పెదను. వినుము. ఆత్మసాక్షాత్కారము జరిగిన వారికయినను 'దేహము పోవునంతవఱకు అజ్ఞానము లేదా అవిద్య ఉండును. అయితే అది దగ్ధపటమువలె నామమాత్రముగా నుండును. జ్ఞానమునకు ప్రతిబంధకముగా నుండదు. (దగ్ధపటము=అనగా నిప్పుపై వేసిన వస్త్రము కాలినను అకారము కదలనంత వఱకు వస్త్రశిల్పముతోనే యుండును. చేయివేసినచో నుసినుసి అగును. అట్లే అవిద్య జ్ఞాన దగ్ధముగానే ఉండును. కాని దానికి శక్తియుండదు. ప్రతిబంధకము కాలేదు.) ఈ అజ్ఞానము వలన 'ద్వైతము' తోచుచుండును (అనగా నల్ల కళ్లజోడు పెట్టికొన్న వానికి ప్రపంచము నల్లగా కనబడును. అంతమాత్రముచేత ప్రపంచము నలుపు అని వాడు భావించడు. అట్లే దగ్ధవస్త్రము వంటి అవిద్యవలన 'ద్వైతము' తోచుచుండును. కాని బ్రహ్మ భావనకు ప్రతిబంధము చేయలేదు) పరమార్థదశలో మాత్రము అజ్ఞానము పూర్తిగా నశించును. సమాధి మొదలగువానిలో అవిద్య శక్తిహీనమై ప్రక్కకు తొలగును. ఈశ్వర చైతన్యమయినను వ్యవహారదశలో (తాను రాముడు, అనియో సృష్టికర్తననియో) అజ్ఞానముతో అనగా అవిద్యతో కూడియే ప్రవర్తించును. జ్ఞానము వలన అజ్ఞాన నివృత్తి

లేదని దీని అర్థము కాదు. అజ్ఞానము నశించును. అంతవఱకు జ్ఞానము వలన శక్తిహీనమై దగ్ధవస్త్రసమానమై బలహీనముగా అప్రతిబంధకముగా నుండి 'ద్వైతబుద్ధి' ని వ్యవహారమునందు కలిగించును. అని మేము చెప్పదలచినది.

40) **వస్తుతస్తు, యే స్వస్వరూప మాత్మానం సాక్షాత్కృతవంతః తే సర్వేపి ఆత్మదర్శినః ఆత్మభూతా ఏవ-'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' ఇతి శ్రుతేః ఆత్మని కాలత్రయేపి అజ్ఞానాభావాత్ తేష్వపి నాజ్ఞాన మితి కథం ద్వైతశంకా. కింతు అస్మద్దృష్ట్యా సచ్చిదానందరూపే ఆత్మని శంకరాచార్య శిష్య గ్రంథాది ద్వైత ప్రతీతిః, న తు తద్దృష్ట్యా-ఇతి న కోపి దోషః**

**ఏతేన ఈశ్వరస్య జగద్వ్యాపారః ఇవ శ్రీశంకరాచార్యాదీనాం గ్రంథాది వ్యాపారోపి సుతరాం అసంబద్ధోపి ప్రతీయతే పృథగ్జనైః సత్యః ఇవేతి సిద్ధమ్** - అసలయితే, స్వస్వరూపమును దర్శించిన ఆత్మవేత్తలందఱు 'ఆత్మస్వరూపులే'. బ్రహ్మవేత్త బ్రహ్మయే అగును అని శ్రుతి. ఆత్మయందు ఏకాలమునందైనను అజ్ఞానము అనునది లేదు. కనుక జ్ఞానులందును అజ్ఞానము ఉండరాదు. కనుక ద్వైతము గూర్చి శంక అనవసరము. మనవంటి అజ్ఞానుల దృష్ట్యా సచ్చిదానంద స్వరూపమయిన 'ఆత్మ' యందు శంకరాచార్యాదులు శిష్యుల కొఱకు వ్రాసిన గ్రంథములకు సంబంధించి ద్వైతము తోచుచున్నది. కాని శంకరాదుల దృష్ట్యా ద్వైతములేదు. కనుక దోషములేదు. ఈశ్వరుని ప్రపంచ సృష్టివలె శంకరాచార్యాదుల గ్రంథరచన గూడా బొత్తిగా మిథ్యయే. దానిని అజ్ఞానులు సత్యమని భ్రాంతి చెందెదరు. అని సిద్ధాంతము.

41) **తథాచ, అద్వితీయ పరమానందబోధస్వరూపః ఈశ్వరః శ్రీకృష్ణః యథా భారత యుద్ధాదికం జగత్సృష్ట్యాదికం చ లీలయా చకారేవ తథా శ్రీశంకరాచార్యాదయోపి భాష్యాది గ్రంథాన్ లీలయా రచయాం బభూవురివ. ఇవ శబ్దాన్నతు వస్తుతః ఇతి భావః**-కాగా, అఖండ సచ్చిదానంద స్వరూపుడైన ఈశ్వరుడు సృష్టిని, కృష్ణుడుగా భారతయుద్ధాదికమును లీలగా చేసెను-కాదు కాదు-చేసినట్లు అనిపించెను. అట్లే

శంకరాదులు భాష్యాది గ్రంథములను లీలగా రచించినట్లు తోచు చుండిరి. వాస్తవముగా రచింపలేదని అర్థము.

42) అత్రేదం తత్త్వమ్. యోఽస్మాభిః ప్రతీయతే-సః న శంకరాచార్యః, నాపి కృష్ణః, కింతు విలక్షణో దేహ ఏవ. స ఏవ వ్యవహారాశ్రయః యస్తు తద్దేహాంతర్యామీ పరమానంద ఆత్మా సః న వ్యవహరతి, నాపి అస్మాభిః దృశ్యతే, సః ఏవ శంకరాచార్యః భగవాన్ కృష్ణశ్చ. తస్మాత్ అద్వైతస్య ఆత్మనః కథం ద్వైతదర్శనమ్? న కథమపి. తస్మాత్ న ద్వైత దర్శనం శంకరాచార్యానాం నాపి గ్రంథకరణమ్, కింతు దేహేంద్రియాదీనా మేవేతి-అసలు విషయము ఇది :- మనము ఎవరిని శంకరాచార్యుడని కృష్ణుడని అనుకొనుచున్నామో వారు కేవలము దేహేంద్రియములే. ఆత్మకాదు. అనగా మనకు కనబడువారు ఆ దేహములే. దానిని బట్టియే వ్యవహారము. దేహాంతరవ్యాప్తుడయిన (అంతర్యామి) పరమాత్మ పరమానందస్వరూపుడు. ఆయన కనబడడు. వ్యవహారము లోనికిరాడు. ఆ ఆత్మయే శంకరాచార్యుడు. ఆ ఆత్మయే కృష్ణభగవానుడు. కనుక అద్వైతమయిన అఖండమయిన ఆత్మకు 'ద్వైతము' లేదు. ఎట్లు సంభవించును? కనుక శంకరాచార్యాదులకు ద్వైత దృష్టి లేదు. వారు గ్రంథములు వ్రాయలేదు. దేహేంద్రియాదులు మాత్రమే గ్రంథములు వ్రాసినవి.

43) నన్వేవం ఆత్మా ఆత్మైవ. అనాత్మా అనాత్మైవ-ఇతి వ్యర్థోయం గ్రంథః ఇతి చేత్ మైవమ్-దేహే గచ్ఛతి సతి అహం గచ్ఛామీతి, దేహే స్థూలే సతి అహం స్థూల ఇతి-ఏవం అన్యోన్య తాదాత్మ్యాధ్యాసస్య సత్త్వాత్ తన్నివృత్తయే ఆవశ్యకః-ఇతి తస్మాత్ న గ్రంథారంభానుపపత్తిః నాపి గ్రంథ ప్రతిపాద్యాభావః. నాపి గ్రంథ ఫలాభావః- అయ్యా!, అలాగున అయితే, ఆత్మ ఆత్మయే. అనాత్మ (జడము) అనాత్మయే. కనుక గ్రంథము వ్యర్థమే కదా! అన్నచో అలా కాదు. శరీరము నడుచుచుండగా 'నేను నడచుచున్నాను' అని, శరీరము 'లావుగా' వున్నచో నేను లావుగానుంటిని అని భావించుచున్నాము. శరీరమునకు ఆత్మకు

అన్యోన్యము తాదాత్మ్యము అధ్యాస చేయబడినది. ఈ అజ్ఞానపు అధ్యాసను నివర్తించుటకు గ్రంథము అవసరమే. కనుక గ్రంథారంభము యుక్తియుక్తమే. గ్రంథము నందు నిరూపింపవలసిన విషయము వున్నది. గ్రంథఫలితము కూడా వాస్తవముగా నున్నదే.

44) **నను అధికారి విషయ సంబంధ ప్రయోజనాని చత్వారి గ్రంథ నిర్వాహకాణి, తత్ర అద్వైతం విషయః, ప్రతిపాద్య ప్రతిపాదక భావః సంబంధః, సంసార నివృత్తిః ప్రయోజన మితి త్రయ మభిహితమ్, అధికారీ తు న నిరూపితః సః సుతరాం అసంభవీచ తథాహి, కి మస్మిన్ గ్రంథే అధికారీ ఆత్మా? ఉత అనాత్మా? నాద్యః- తస్య నిర్ధర్మకత్వేన అధికృతత్వ రూప ధర్మాసంభవాత్ నాపి అనాత్మా, తస్య జడత్వాత్ ఇతి చేత్** - అయ్యా!, ఒక గ్రంథము వ్రాయుటకు కావలసినవి (1) అధికారి (2) విషయము (3) సంబంధము (4) ప్రయోజనము. ఇందులో విషయము అద్వైతము. సంబంధము:-ఇది చర్చనీయాంశము. గ్రంథము చర్చించేది కనుక సంబంధము కలదు. ప్రయోజనము సంసారము నివర్తించుట అను '3' విషయ సంబంధ ప్రయోజనములు చెప్పబడినవి. 'అధికారి' మాత్రము తెలియుటలేదు. పైగా 'అధికారి' అసంభవము గూడా. అధికారి అనగా ఈ గ్రంథమును చదువు అర్హతకలవాడు. ప్రయోజనమును పొందవలసినవాడు. అసంభవమే. ఏమనగా; దీనికి అధికారి అత్మయా? అనాత్మయా? 'ఆత్మయే' అన్నచో ఎట్టి గుణములు, ధర్మములు లేని 'ఆత్మ'కు 'అధికారి' అను అర్హత మాత్రము ఎట్లు? 'అనాత్మ' అధికారియందుమా? కుదరదు. అది జడమయిన శరీరేంద్రియాదులు కదా! వానికి గ్రంథము తెలియదు. జ్ఞానము రాదు-అనగా;

45) **మైవమ్. ఆత్మానాత్మ తాదాత్మ్యాపన్నః పురుషః ఇతి అస్తి అత్ర అధికారీ, సహి మనోబుద్ధ్యాద్యనాత్మ తాదాత్మ్యాధ్యాసేన సుఖదుఃఖాదిక మనుభవన్ సంసరన్ సంసార జాత నిర్వేదతయా ముముక్షుః సన్ ఇహ అధికారితాం భజతే. ఏతేన ముముక్షవః అత్ర అధికారిణః ఇతి సిద్ధమ్** - అట్లు

కాదు. 'ఆత్మ వేఱు, అనాత్మ వేఱు లేదా నేను వేఱు జడమయిన శరీరాదికము వేఱు' అను వివేకము లేని 'పురుషుడు' కలడు. ఆ 'చిదాభాసుడు' ఈ గ్రంథములకు 'అధికారి'. అతడు మనస్సు బుద్ధి మొ॥ జడ పదార్థములతో తనను ఏకము చేసికొని సుఖదుఃఖాదులను అనుభవించుచు సంసారమున పడియుండును. సంసారమున నిర్వేదము కలిగి మోక్షవాంఛతో ఈ గ్రంథమునకు 'అర్హుడు'గా మాఱును. కనుక ముముక్షువులు ఈ గ్రంథమునకు అధికారులు అని నిశ్చయము.

46) **అవతారిక :- అథ కృత పరమాత్మ తత్త్వానుస్మరణాత్మక మంగళః కవిః అద్వైతామృత కలశాయితం కోశం విదధాతిః**-ప్రథమ శ్లోకమున దాని వ్యాఖ్యయందును పరమాత్మ తత్వమును స్మరించి మంగళా చరణమును చేసిన రామకవి 'అద్వైతామృతకలశము' వంటి కోశమును ప్రారంభించుచున్నాడు.

47) **తథాహి,**

**'విష్ణ్వీశ నారాయణ తత్పరాత్మ-బ్రహ్మాది శబ్ద ప్రతిపాదితో యః॥ సచ్చిత్సుఖాత్మా విగుణో ప్రమేయః-సోహం భవామ్యేవ న దృశ్యరూపః॥**

- అనగా విష్ణువు అనియు, ఈశ్వరుడనియు, నారాయణు డనియు, బ్రహ్మ మనియు ప్రతిపాదింపబడిన నిర్గుణుడు, సచ్చిదానంద స్వరూపుడును అప్రమేయుడును అగు ఆ 'వస్తువు' నేనే. ఈ కనబడే దేహము మొ॥ రూపము నేను కాను అని అర్థము.

48) **నను ఏతద్గ్రంథప్రతిపాద్యమానం అద్వైతం కిం జీవేశ్వరయోర్వా? జీవ జగతోః? యద్వా జగదీశ్వరయోః? వేదాంతమతే దృగ్దృశ్యాత్మక పదార్థ ద్వయ స్యైవాభ్యుపగమాత్ జీవేశ్వర రూపేణ దృశోః ద్వివిధత్వాత్ జగతశ్చ దేహేంద్రియాదిరూపేణ బహువిధత్వాచ్చ. ఏకజీవవాదే నాన్యో వికల్పః సంభవతి. నానాజీవవాదే తు కిం జీవానాం పరస్పర మద్వైత మితి అన్యోపి వికల్పః సంభవతీతి జ్ఞేయమ్** - అయ్యా!, ఈ గ్రంథము నీవు ప్రతిపాదింపదలచిన అద్వైతము అనగా అభేదము (1) జీవేశ్వరులకా? (2) జీవ జగత్తులకా? (3) ఈశ్వర జగత్తులకా? మీ వేదాంతమతము

నందు '2' పదార్థములు మాత్రమే అంగీకరింప బడినవి. (1) దృక్=ద్రష్ట (2) దృశ్యము. అందు దృక్=జీవుడు ఈశ్వరుడు అని 2 విధములు. దృశ్యము అయిన జగత్తు దేహేంద్రియాది రూపములతో బహు విధము. ఏక జీవవాదమునందు ఇతర వికల్పములుండవు. నానాజీవవాదము నందు మఱొక వికల్పమునకు అవకాశము గలదు. కారణమేమనగా అంతఃకరణములను బట్టి అనేక జీవులు అని వారి మతము. కనుక దాని ప్రకారము 4 వ వికల్పము (4) జీవుల మధ్య పరస్పరము అద్వైతమా? (కనుక గ్రంథమునందు ఈ '4' అద్వైతములలో ఏది ప్రతిపాదింప బడినది అని ప్రశ్న)

49) న తావదాద్యో వికల్పః సాధుః అహం ప్రత్యయ విషయస్య కర్తుః భోక్తుః కించిద్‌జ్ఞస్య జీవస్య తత్ప్రత్యయ విషయస్య సాక్షిణః సర్వజ్ఞస్య ఈశ్వరస్య చ మహతో వైలక్షణ్యస్య సత్త్వాత్. శ్రూయతే హి 'ద్వాసుపర్ణా సయుజౌ సఖాయౌ సమానం వృక్షం పరిషస్వజాతే. తయోరేకః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్ అన్యః అభిచాకశీతి'. ఇతి దేహరూపే వృక్షే జీవేశ్వర నామానౌ ద్వౌ పక్షిణౌ స్తః, తత్ర ఏకో జీవః కర్మఫలం భుంక్తే, అన్యః ఈశ్వరస్తు సాక్షాత్ పశ్యతీతి శ్రుతే రర్థః. అనుభూయతే చ జీవస్య పారతంత్ర్యం సర్వైః, తేనానుమీయతే చ ఈశ్వరస్య స్వాతంత్ర్యమ్. తర్కాది శాస్త్రాంతరేష్వపి స్ఫుటం జీవేశ్వరయోః భేదః. జీవో హి కించిద్‌జ్ఞ మాత్మానం అపరోక్షతయా వేత్తి, సర్వజ్ఞ మీశ్వరం తు పరోక్షతయా ఇతి ఏతచ్చ అనుభవసిద్ధమ్. అతః న జీవేశ్వరయోః అద్వైతమ్ - దీనిలో 'జీవ-ఈశ్వరుల' అభేదము అనునది కుదరదు. ఏమనగా, జీవుడు-'అహం' అనుభావన గలవాడు కర్త, భోక్త, అల్పజ్ఞాని. ఈశ్వరుడు-తత్ అను పదమునకు అర్థము. సర్వసాక్షి, తటస్థుడు, కూటస్థుడు, సర్వజ్ఞుడు ఈ విధముగా జీవేశ్వరుల మధ్య ఇంత భేదము కలదు. ద్వాసుపర్ణా- అను వేదమంత్రము గూడా ఇట్లే చెప్పుచున్నది. 'దేహము' అను ఒక వృక్షముపైన జీవుడు, ఈశ్వరుడు అను 2 గరుడ పక్షులు గలవు. అందు జీవుడు కర్మఫలమును అనుభవించును,

ఈశ్వరుడు కేవలము సాక్షిగా చూచుచుండును. ఇది వేదార్థము. అనుభవములో గూడా, జీవుని పరతంత్రత కనబడుచునేయున్నది. దానిని బట్టి యీశ్వరుని 'స్వతంత్రత' అర్థమగుచున్నది.

తర్కశాస్త్రము మొ॥ శాస్త్రములందు జీవేశ్వరుల మధ్య భేదము చెప్పబడినది. జీవుడు తనను తాను ప్రత్యక్షముగా తెలిసికొనగలడు. ఈశ్వరుని పరోక్షముగా తెలిసికొనగలడు. అనుభవము ఇట్లున్నది. కనుక జీవేశ్వరుల మధ్య అభేదము కుదరదు.

50) **నాపి చతుర్థః వికల్పః సమీచీనః-నృపత్వ మంత్రిత్వ భృత్యత్వ పతిత్వ జాయాత్వ, ధనికత్వ దరిద్రత్వ, సుఖిత్వ, దుఃఖిత్వ, కాణత్వ, బధిరత్వాది నానాధర్మ సమాశ్రయ ప్రయుక్త నానాజీవ పరస్పర భేదస్య లోకశాస్త్ర సిద్ధత్వాత్. సతి చ బహూనాం జీవానాం అద్వైతే ఏకముక్తౌ సర్వముక్తి ప్రసంగః. జీవాంతర బంధాత్ పునర్ముక్త జీవబంధ ప్రసంగో వా స్యాత్** –'4' వికల్పము అనగా 'జీవుల మధ్య పరస్పరము అద్వైతము వచ్చును' అనునది యుక్తము కాదు. ఏమనగా ఈ జీవులమధ్య పరస్పర భేదములు చాలా గలవు. ఒకడు రాజు మఱొకడు మంత్రి, అలా, సేవకుడు, భర్త, భార్య, ధనికుడు, దరిద్రుడు, సుఖవంతుడు, దుఃఖవంతుడు, గ్రుడ్డివాడు, చెమిటివాడు; కనుక వీరి మధ్య అద్వైతము అయుక్తము. పైగా, జీవుల మధ్య అభేదము' అన్నచో ఒకడు మోక్షము పొందినచో అందఱు జీవులకు మోక్షము రావలసియుండును. లేదా ఒక జీవుని బంధము వలన ముక్త జీవునికి మఱల బంధము ఏర్పడవలసి వచ్చును. కనుక అనేక జీవుల మధ్య అభేదము సాధ్యము కాదు.

51) **ఏక జీవవాదస్తు దుష్ట ఏవ. బహూనాం జీవానాం ఉపలభ్యమానత్వాత్. ఏక జీవముక్తౌ జీవాంతరాభావేన జగదాంధ్య ప్రసంగాత్** – ఏక జీవవాదము అనగా ప్రపంచమున నున్నది. 'ఒక్కజీవుడు మాత్రమే' అనువాదము అసలు యుక్తము కాదు. అనేక జీవులు అనుభవములో నున్నారు కదా! ఒక జీవుడు ముక్తి పొందినచో ఇక జీవులే లేరని చెప్పవలసివచ్చును. ప్రపంచమంతయు నిర్జీవమగును. గ్రుడ్డిదగును.

52) **నాపి ద్వితీయః, చేతనస్య ద్రష్టుః భోక్తుః జీవస్య అచేతనస్య దృశ్యస్య భోగ్యస్య జగతశ్చ మిథో విరోధాత్** – రెండవవాదము 'జీవజగత్తులకు' అభేదము అనునదియు పొసగదు. జీవుడు=చేతనుడు, జ్ఞానరూపుడు, ద్రష్ట భోక్త, ప్రపంచము=అచేతనము, జడము, దృశ్యము, భోగ్యము కాగా వీని మధ్య చాలా విరోధము/భేదము, స్పష్టముగదా, ఎట్లా అభేదము?

53) **నాపి తృతీయః, సచ్చిదానందరూపస్య ఈశ్వరస్య అనృత జడ దుఃఖాత్మక జగదభేద ప్రతిపాదన సంభవాత్. తస్మాత్ దుర్నిరూప మద్వైత మితి ప్రాప్తే** – మూడవ పక్షము 'ఈశ్వర జగత్తులకు అభేదము' అను పక్షమున్ను కుదరదు. ఈశ్వరుడు=సచ్చిదానందరూపుడు, ప్రపంచము=అనృత జడ దుఃఖ స్వరూపము. ఈ '2' మధ్య అభేదము అసంభవము. కనుక ఈ గ్రంథములో చర్చింపదలచిన అద్వైతము / అభేదము అసంభవము కనుక గ్రంథము దండుగ. అని తేలినది.

54) **ఆహ–'విష్ణు–' ఇతి జీవేశ్వరయో రేవ అత్ర అభేదః ప్రతిపాద్యతే. తత్త్వమస్యాది మహావాక్య ప్రామాణ్యాత్. 'ఐతదాత్మ్య మిదం సర్వం, నేహ నానాస్తి కించన, యత్ర హి ద్వైత మివ భవతి త దితర ఇతరం పశ్యతి' ఇత్యాది శ్రుత్యంతరసంవాదాచ్చ. 'ద్వాసుపర్ణా–' వితి శ్రుతి ప్రతిపాదితౌ తు పక్షిణౌ న జీవేశ్వరౌ, కింతు జీవకూటస్థౌ** – అద్వైతమున 'జీవేశ్వరులకే' అభేదము చెప్పబడినది. 'తత్త్వమసి' అను మహావాక్యము అందుకు ప్రమాణము. అంతేగాక 'ఈ సర్వమునకు ఆత్మ ఇదే, ఇచ్చట ద్వైతము లేదు. ఒక్కటే ఉన్నది. ద్వైతమున్నచోట మాత్రమే ఒకరు వేరొకరిని చూడగలరు. మొదలగు శ్రుతులు దీనినే బలపఱచుచున్నవి. 'ద్వాసుపర్ణా–' అను మంత్రములో చెప్పబడిన పక్షులు జీవేశ్వరులు కారు. జీవకూటస్థులు. లేదా ప్రత్యగాత్మ చిదాభాసులు.

55) **యద్వా బుద్ధి జీవౌ. బుద్ధితాదాత్మ్యాధ్యాసాత్ బుద్ధిగతం కర్తృత్వాదికం జీవే ఆరోపితం, న తు వస్తుతః ఇతి అభిప్రాయేణ తచ్ఛ్రుతి ప్రవృత్తేః ఇయం చ బుద్ధిః స్వతః అచేతనా కూటస్థ సాన్నిధ్యాత్, తత్ప్రతిబింబ**

గ్రహణాద్వా చేతనేన భాసత ఇతి కూటస్థ పరతంత్రా చ. కూటస్థః జీవస్తు నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావతయా న కస్యచిత్ శేషః - లేదా ఆ మంత్రమున చెప్పబడినది 'బుద్ధి జీవులను గూర్చి. బుద్ధియందు జీవుని తాదాత్మ్యము వలన బుద్ధియందలి 'కర్తృత్వము' జీవునియందు ఆరోపింపబడినది. అంతేగాని జీవుడు వాస్తవముగా కర్తకాదు. కనుక బుద్ధి - కర్త భోక్త.

ఆత్మ-అకర్త అభోక్త అని అచ్చట చెప్పబడినది. అదే ఆ శ్రుతికి అర్థము. 'బుద్ధి' స్వతహాగా అచేతనము అనగా జడము. కూటస్థుని సన్నిధివలన లేదా ఆతని ప్రతిబింబగ్రహణము వలన, (అయస్కాంత సన్నిధిలోని సూదివలె) బుద్ధి చైతన్యము కలదయినది. కూటస్థునికి స్వాధీనమయినది. కూటస్థుడు మాత్రము నిత్య, శుద్ధ, బుద్ధ (జ్ఞాని) ముక్త స్వభావుడు కనుక ఆయన ఎవరికి పరతంత్రుడుగాడు.

56) సర్వేషాం జీవపారతంత్ర్యానుభవ స్తు బుద్ధితాదాత్మ్యాధ్యాసేనైవ, న తు వస్తుతః। భేదవాదీని తర్కాది శాస్త్రాణి తు అప్రమాణాన్యేవ అనుపనిష న్మూలత్వాత్. బుద్ధి తాదాత్మ్యాధ్యాస మాపన్నః ప్రమాతా జీవస్తు వేదాంత శ్రవణాదికం వినా కించిద్జ్ఞం ఆత్మాన మేవ అపరోక్షతయా పశ్యతి - అయితే 'జీవులు పరతంత్రు లయినట్లు కన్పించుటకు కారణము 'బుద్ధి' తో జీవునికి తాదాత్మ్యమును భావించుట వలననే. వాస్తవముగా మాత్రము కాదు. భేద వాదములు చేయు 'తర్కము' మొదలగు శాస్త్రములు ప్రమాణమయినవి కావు. అవి ఉపనిషత్తులకు విరుద్ధములు. కాగా, బుద్ధితో ఏకమయిన 'ప్రమాత' అయిన జీవుడు వేదాంత శ్రవణము మొదలైనవి లేనిచో తనను అల్పజ్ఞాని అయిన ఆత్మగానే గ్రహించును.

57) సతితు, శ్రవణాదికే స్వస్వరూపజ్ఞానే బుద్ధితాదాత్మ్యాధ్యాసనాశాత్ సర్వజ్ఞం సర్వావభాసకం నిత్యశుద్ధం బుద్ధ ముక్తం కూటస్థం ఈశ్వరం ఆత్మానం సాక్షాత్కరోతీతి విద్వదనుభవసిద్ధ మిదమ్. అతః న జీవేశ్వరయోః అద్వైతే కశ్చిదపి శ్రుత్యాది విరోధః శక్యతే ప్రతిపాదయితుమ్ - వేదాంత

శ్రవణము, మననము మొదలైనవి ఉన్నచో సాధకునకు స్వస్వరూప జ్ఞానము కలుగును. దానితో బుద్ధితో ఉన్న సంబంధము తొలగును. అపుడు తాను సర్వజ్ఞుడనని, సర్వప్రకాశకుడనని, నిత్యుడనని, శుద్ధుడనని, బుద్ధుడనని ముక్తుడనని, కూటస్థుడనని, ఈశ్వరుడనని దర్శించును. ఇదంతయు విద్వాంసులకు అనుభవ సిద్ధమయిన విషయము. కనుక జీవేశ్వరులకు అద్వైతము సిద్ధము. వేద విరోధము లేదు. ఉన్నదని చెప్పుట అశక్యము.

58) **నను కోసౌ ఈశ్వరః యదభేదో జీవస్య ప్రతిపిపాదయిషితోత్రాహ '-విష్ణు-' ఇతి. విష్ణుః విశ్వం వేవేష్టి వ్యాప్నోతీతి విష్ణుః వ్యాపకః 'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః 'ఇతి శ్రుతేః తదైక్షత బహుస్యాం ప్రజాయేయ' ఇతి, తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్, తదను ప్రవిశ్య సచ్చ త్యచ్చాభవత్-ఇత్యాది శ్రుతిభ్యః, 'సర్వం విష్ణుమయం జగత్' ఇతి స్మృతేశ్చ.**- అయ్యా! ఎవడు ఈ ఈశ్వరుడు? ఇతనితో గదా మీరు జీవునకు అభేదమును ప్రతిపాదింపదలచినది. అను ప్రశ్నకు సమాధానము '-విష్ణు-' మొదలైన పద్యముతో చెప్పుచున్నాడు.

విష్ణువనగా విశ్వమున వ్యాపించువాడు అని అర్థము. వేదములుగూడా ఇట్లే చెప్పుచున్నవి. 'లోపల బయట నారాయణుడు వ్యాపించియున్నాడు,' అనియు, ఆబ్రహ్మము తను బహురూపములు కావలెనని కోరుకొని సృష్టించి ఆ సృష్టిలో ప్రవేశించినదని, అదే 'సత్తు, తత్తు' అయినదని వేదములు చెప్పినవి. 'జగత్తంతయు విష్ణుమయమని' స్మృతియుచెప్పినది.

59) **నను విరుద్ధ ముక్తం యదీశ్వరస్య జగద్రూపత్వం, జగద్రూపస్య తస్య జగద్వ్యాపకత్వం చేతి చేత్ నైష దోషః** - అయ్యా! మీరు చెప్పునది విరుద్ధముగనున్నది. ఈశ్వరుడు ప్రపంచస్వరూపుడని చెప్పితిరి. మఱల ఆయన జగత్తునందు వ్యాపించియుండెను అని చెప్పుచుంటిరి? దోషము కాదా? అని ప్రశ్న. దోషముకాదు అని సమాధానము.

60) **సర్వదోషాపహారిణ్యాః అఘటిత ఘటనాత్మికాయాః మాయాయాః సత్త్వాత్** - అసంభవములను సంభవముచేయగల 'మాయ' గలదు గదా! అది ఏదోషమునయినను అపహరింపగలదు.

61) **రజ్జు రవిద్యయా సర్పాకారేవ ఈశ్వరః మాయయా జగదాకారః ఇతి వివక్షితత్వాత్** – 'అవిద్య' అనగా అజ్ఞానమువలన రజ్జువు సర్పముగా తోచినట్లు ఈశ్వరుడు మాయ వలన 'జగత్తుగా' కన్పడును అని చెప్పదలచితిమి.

62) **న చేయ మప్రసిద్ధా మాయా,'మాయాం తు ప్రకృతిం విద్యాత్, మాయినం తు మహేశ్వరమ్' ఇత్యాది శ్రుతి సిద్ధత్వాత్, 'అహ మజ్ఞః' ఇత్యాద్యనుభవసిద్ధత్వాచ్చ. అజ్ఞానం హి మాయా** – 'మాయా' అనునది క్రొత్త విషయము కాదు. గీతయందు పై శ్లోకమున చెప్పబడినదే. 'మాయ అనగా ప్రకృతి ఈశ్వరుడు మాయావి' అని వేదము మొదలగు వానిచే చెప్పబడినది. అట్లే అనుభవములో 'నేను అజ్ఞానిని' అని అనుకొనుట గలదు గదా. ఆ అజ్ఞానమే మాయ.

63) **కారణస్య వస్తునః కార్యవ్యాపకత్వం చ సర్వసంప్రతిపన్నమ్. మృది కల్పితస్య ఘటస్య మృద్వ్యావృత్త్వదర్శనాత్, రజ్జు కల్పితస్య సర్పస్య రజ్జువ్యావృత్త్వ దర్శనాచ్చ. క్షీరే కల్పితస్య దధ్నః క్షీరవ్యావృత్త్వ దర్శనాచ్చ. ఘటాదేః కార్యజాతస్య సద్భావే అసద్భావేచ మృదః సత్వాత్ వ్యాపకత్వమ్. తథా జగతః సద్భావే అభావే చ సత్త్వాత్ ఈశ్వరస్య వ్యాపకత్వమ్ మృది ఘటస్యేవ ఈశ్వరే జగతః కాలత్రయేపి అభావాత్ వ్యావృత్త్వం ఘటస్యేవ జగతః ఇతి వివేకః** – కారణమయిన వస్తువు కార్యమునందు వ్యాపించియుండును అను విషయము సర్వామోదము గలది గదా! మట్టితో కల్పించిన 'కుండ' యందు 'మట్టియే' వ్యాపించియుండును గదా! త్రాడునందు కల్పింపబడిన పామునందు 'త్రాడే' యుండును గదా! అట్లే ఈశ్వరునియందు కల్పింపబడిన జగత్తునందు ఈశ్వరుడే వ్యాపించియుండును. జగత్తు ఉన్నను లేకున్నను ఈశ్వరుడే వ్యాపి. మట్టియందు కుండ ఉన్నట్లు ఈశ్వరునియందు ప్రపంచము కల్పితముగానున్నది. కనుక 'జగత్తు' కాలత్రయము నందు లేనిది కనుక ఘటము వలె వ్యావ్యము అని వివేకము.

64) **నను కార్యస్య జగతః ఘటాదేశ్చ ఉత్పత్తేః ప్రాక్ నాశాత్ పశ్చాచ్చ**

**భవతు అసత్త్వమ్. కథం పునః ఉత్పత్త్యనంతరం వర్తమానకాలే భవేదసత్త్వమ్? తత్రాపి అసత్త్వే 'ఘటోస్తి, జగదస్తి' ఇతి ప్రతీత్యనుదయ ప్రసంగాత్ ఇతి చేత్** - అయ్యా! కార్యమయిన ప్రపంచము గాని ఘటము గాని పుట్టకముందు గిట్టిన తర్వాత లేకపోవచ్చు. పుట్టిన తరువాత వర్తమాన స్థితిలో గూడా లేకపోవుట యెట్లు? త్రికాలములందు లేదని యేల చెప్పితివి. పైగా నిజముగా లేకపోతే 'కుండ ఉన్నది, ప్రపంచమున్నది' అను లోక వ్యవహారము ఎట్లు సాగుచున్నది. - అని ప్రశ్న.

65) **ఉచ్యతే, శ్రూయతాం సావధానేన త్వయా-తంతు వ్యతిరేకేణ పటే, మృద్వ్యతిరేకేణ ఘటే చ కిమస్తి వస్తు, త్వం విచార్య బ్రూహి! న కించిదపి. నామాకారౌ తు మాయయా కల్పితౌ 'అస్తి భాతి ప్రియం రూపం నామ చేత్యంశపంచకమ్' ఆద్యం త్రయం బ్రహ్మణోంశః మాయాయా స్త్వితర ద్వయమ్ ఇతి నామ రూపయోః మాయాంశత్వాత్** - చెప్పుచున్నాము. శ్రద్ధగావినుము. వస్త్రములో దారములు గాక, కుండలో మట్టిగాక వేఱే పదార్థము ఏమికలదు. ఆలోచించి చెప్పుము. ఏమియును లేదు. పేరు, ఆకారము మాత్రమే మాయచేత కల్పింపబడినవి – 'ఉన్నది తోచుచున్నది, సుఖమయినది, రూపము, నామము. ఈ '5' అంశములలో మొదటి '3' బ్రహ్మవి. మిగిలినవి '2' మాయవి అను వాక్యము వలన నామరూపములు మాయా సంబంధమయినవి.

66) **'నామరూపే వ్యాకరవాణి' ఇతి శ్రుత్యా నామరూపవ్యాకరణస్యైవ జగన్నిర్మాణత్వాభిమానాత్, నామరూప వ్యతిరేకేణ జగత్పదార్థస్యైవ అభావాత్, బ్రహ్మణి కల్పితం నామరూపాత్మక మిదం జగత్ మృది కల్పితః నామరూపాత్మకః ఘటః మృద్వ్యతిరేకేణేవ బ్రహ్మవ్యతిరేకేణ నాస్తి** - 'నామరూపములను కల్పించెదను' అను వేదము గూడా నామరూప సృష్టియే జగన్నిర్మాణము, అని చెప్పినది కనుక, నామరూపములు మినహాయిస్తే 'జగత్' అను వేఱు పదార్థము లేదు. బ్రహ్మయందు కల్పింపబడిన నామరూపాత్మకమయిన జగత్తు

మట్టియందు కల్పింపబడిన నామరూపాత్మకమయిన ఘటము '2' సమానము. మట్టి తప్ప ఘటములేనట్లు 'బ్రహ్మ' తప్ప జగత్తు లేదు.

67) **కార్యే జగతి కారణస్య ఈశ్వరాంశస్య అస్తిత్వస్య సంకలనాదేవ జగదస్తీతి ప్రతీతిః. మృద్గత సత్తాంశ సంకలనాత్ ఘటః అస్తీతి ప్రతీతివత్. సా చ మృద్గతా సత్తా స్వకారణభూతేశ్వరగత సత్తైవేతి వేద్యమ్. తస్మాత్ గగనే కల్పితం గంధర్వనగరమివ బ్రహ్మణి కల్పితం జగదిదం కాలత్రయేపి నాస్త్యేవ. ప్రతీతేః భ్రాంతిత్వాత్** – కార్యమయిన జగత్తునందు కారణమయిన ఈశ్వరాంశ కల్సియున్నందున దాని 'అస్తిత్వము' కలుపుకొని 'ప్రపంచమునకు' ఉన్నదను వ్యవహారము. మట్టియందలి 'అస్తిత్వము' వలననే 'కుండ ఉన్నది' అను వ్యవహారము వచ్చునట్లు జగత్తుకు అస్తిత్వము వచ్చినది. నిజానికి మట్టియందలి 'అస్తిత్వము' మట్టికి కారణమయిన ఈశ్వరుని అస్తిత్వమే అని గుర్తింపవలయును. కనుక ఆకాశమున కల్పింపబడిన గంధర్వనగరము వలె బ్రహ్మయందు కల్పింప బడిన యీ జగత్తు భ్రాంతి మాత్రమే. '3' కాలములందున్ను లేనిదే, ప్రపంచము తోచుట అనునది భ్రాంతి మాత్రమే. (గంధర్వనగరమనగా, ఆకాశమున మబ్బులతో ఏర్పడు రకరకాల చిత్రములు. అవి ఆకాశమున పుట్టుచుండును. గిట్టు చుండును. అట్లే బ్రహ్మము నందు మాయవలన ప్రపంచము పుట్టును గిట్టును. అంతయు మాయయే. గంధర్వనగరములు మబ్బులే.)

68) **ఇతి ఈశ్వరస్య వ్యాపకత్వమ్ ఏవం సర్వకారణత్వేన సర్వవ్యాపకత్వా దేవ సర్వేశ్వరోయ మిత్యాహ. 'ఈశ' ఇతి 'ఈష్టే' సర్వం నియంతుం శక్నోతీతి ఈశః. 'ఈశాన స్సర్వభూతానాం' ఇతి శ్రుతేః** – ఈ విధముగా ఈశ్వరునికి వ్యాపకత్వము వచ్చినది. సర్వమునకు కారణము, సర్వమునందు వ్యాపకుడు కనుకనే ఈయన సర్వేశ్వరుడు. అందుకనే 'ఈశః' అని శ్లోకములో చెప్పబడినది. సమస్తమును నియమించువాడు కనుక 'ఈశుడు' ఆయన సకల భూతములకు ఈశానుడని వేదములు చెప్పుచున్నవి.

69) కథం నియమన మత ఆహ 'నారాయణ' ఇతి. నరాః ప్రమాతారః జీవాః తేషాం అయనం ప్రవృత్తిః యస్మాత్ సః నారాయణః 'పూర్వపదా త్సంజ్ఞాయామగః' ఇతి ణత్వమ్. సంజ్ఞా హ్యేషా భగవతః ఈశ్వరస్య. అంతర్యామి బ్రాహ్మణోక్త విధయా సర్వాంతరః సన్ అయం సర్వం యమయతి–ఇత్యర్థః – ఎట్లు నియమించును? అనగా 'నారాయణుడు' అని శ్లోకములో గలదు. నరులు అనగా జీవులు. వారికి ప్రవృత్తిని కలిగించువాడు నారాయణుడు. ఇది ఈశ్వరునకు సంజ్ఞ. 'అంతర్యామి బ్రాహ్మణము' నందు చెప్పినట్లు ఆయన అందఱి యందు నుండి అందఱిని నియమించును అని అర్థము.

70) నాస్య కోపి నియామక ఇత్యాహ. 'పరాత్మేతి'. సర్వోత్కృష్ట స్వరూపః అత ఏవ 'సన్' నిత్యః 'అతోన్యదార్తం' ఇతి శ్రుతేః – ఈశ్వరునకు నియామకుడు లేడు. కనుకనే ఆయన 'పరాత్మ' అని శ్లోకమున విశేషణము. సర్వోత్కృష్ట స్వరూపుడు కనుకనే ఆయన నిత్యుడు, సత్తు. 'ఆయనకన్న భిన్నమయినది అసత్యము' అని వేదము.

71) నను ఏవం విధం బ్రహ్మైవ ఇత్యత ఆహ. 'బ్రహ్మేతి'. బృహత్త్వాత్ బృంహణత్వాచ్చ అయ మీశ్వర ఏవ బ్రహ్మ. న త్వస్మాత్ అన్యత్ కించిద్బృహ్మాస్తి ఇత్యర్థః. ఆది పదాత్ పురుషోత్తమాది శబ్ద గ్రహణమ్. అత్ర విష్ణు రీశః బ్రహ్మ చేతి త్రిమూర్తిధారీ ఏక ఏవ అయమీశ్వరః ఇతి విష్ణ్వీశబ్రహ్మాఖ్యాభిః ప్రతిపాద్యతే వ్యంజనావృత్త్యా – ఇట్టి గుణగణములు గలది బ్రహ్మయే. కనుకనే శ్లోకములో 'బ్రహ్మ' అను పదము కలదు. పెద్దది సర్వవ్యాపి కనుక ఈశ్వరుడే బ్రహ్మ. దీనికన్న పెద్దది మఱేదియును లేదు అని అర్థము. శ్లోకమునందలి 'ఆది' అను పదముచే 'పురుషోత్తమ' మొ॥ విశేషములు గలవు. ఇందులో విష్ణువు, ఈశ్వరుడు, బ్రహ్మ' అని త్రిమూర్తిధారి అయిన ఈశ్వరుడు ఒక్కడే అని యిక్కడ వ్యంగ్యముగా అర్థము వచ్చును. అందుకనే ఈశ్వరునికి పై విశేషణములు గలవు.

72) ఏవం ఈశ్వరస్య గుణాన్ ఉక్త్వా స్వరూప మాహ–సచ్చిత్సుఖాత్మేతి. సచ్చిదానంద రూపః 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, ఆనందో బ్రహ్మ'

ఇత్యాది శ్రుతిభ్యః. నాస్య బుద్ధ్యాదీనాం సత్త్వాదయో గుణాః సంతీత్యాహ విగుణ ఇతి. సత్త్వాది గుణత్రయరహితః, వీర్య శౌర్యాదీనాం కామ క్రోధాదీనాం చ గుణాంతరాణాం గుణత్రయ ఏవ అంతర్భావః. జ్ఞానానందౌ తు నేశ్వర స్వరూపాత్ పృథగ్భూతావితి న గుణౌ. వృత్తి జ్ఞాన విషయానందావేవ గుణౌ. సచిత్ప్రతిబింబాంతఃకరణవృత్తిః విజ్ఞానం, సానన్దప్రతిబింబాన్తఃకరణవృత్తిః విషయ సుఖమితి వివేకః - ఈ విధముగా ఈశ్వరుని గుణములను చెప్పి స్వరూపమును చెప్పు చున్నాడు. 'సచ్చిత్సుఖ స్వరూపుడు అని (శ్లోకములో) సత్యజ్ఞాన ఆనంద స్వరూపుడు అని భగవంతుని గూర్చి వేదములు చెప్పుచున్నవి. ఆయన బుద్ధి మొ॥ వానికి సత్వము మొ॥ గుణములు లేవు. అందువలన 'విగుణుడు' అని శ్లోకములో గలదు. సత్వాది గుణములు '3' ఈయనయందు లేవు. వీర్య, శౌర్య, ధైర్య మొ॥ గుణములు ఈ '3' గుణములలోనివే. కనుక ఈశ్వరునియందు ఏ గుణములు లేవు. జ్ఞానానందములు ఆయన గుణములు గావు. అవియే ఆయన స్వరూపము. కనుక గుణములు అని చెప్పరాదు. వృత్తి జ్ఞానములుగా వచ్చిన ఆనందములు, జ్ఞానములు మాత్రమే గుణములు. 'వృత్తి జ్ఞానము' అనగా చైతన్యముతో గూడిన అంతఃకరణ వృత్తియే వృత్తి జ్ఞానము. అట్లే ఆనందముతో గూడిన అంతఃకరణ వృత్తియే విషయసుఖము అని తేడా. కనుక అంతఃకరణ రహితమయిన బ్రహ్మము ఆనంద స్వరూపము, జ్ఞాన స్వరూపము. కనుక బ్రహ్మము నిర్గుణము.

73) చిన్మయత్వేన సర్వసాక్షిత్వేన నాయం ఘటాదివత్ ప్రమావిషయః ఇత్యాహ-'అప్రమేయః'- ఇతి. వృత్త్యుత్థితో బోధః ప్రమా. తస్యా అవిషయః. నిర్విశేష చిన్మాత్రత్వాత్ ప్రమాతుం అశక్య ఇత్యర్థః. సః తత్త్వ మసి' ఇత్యాది శ్రుతిగత తచ్ఛబ్దవాచ్యః. ఏవం విధః ఈశ్వరః నాసౌ పరోక్షః ఇత్యాహఅహమితి. అస్మచ్ఛబ్ద వాచ్యస్య కుతః పరోక్షత్వ మితి భావః - జ్ఞానరూపుడు కనుక, సకల సాక్షి కనుక ఈశ్వరుడు ఘటాదుల వలె ప్రమేయుడు కాడు-కనుక 'అప్రమేయుడు' అని శ్లోకమున చెప్పబడినది. 'వృత్తి' అనగా అంతఃకరణ వ్యాపారము వలన

వచ్చిన జ్ఞానము 'ప్రమ'. దానికి ఈశ్వరుడు గోచరించడు. ఎటువంటి భేదములు, గుణములు లేని జ్ఞానమాత్ర స్వరూపుడు కనుక అంతః కరణ వృత్తికి అందుట లేదు. కనుక ప్రమేయము కాదు. 'అదేనీవు' అను వేదవాక్యమందలి 'అదే' అను పదము బ్రహ్మనే చెప్పును. ఇటువంటి ఈశ్వరుడు పరోక్షము కాదు అను అభిప్రాయముతో 'అహం' అని శ్లోకమున చెప్పబడెను. 'నేను' అను శబ్దముచే అందఱియందు చెప్పబడిన వాడు కనుక 'ఈశ్వరుడు' అందఱకు తెలిసినవాడే. అప్రసిద్ధుడు కాదు.

74) **నను పరోక్షస్య తచ్ఛబ్ద వాచ్యత్వా దపరోక్షస్య చ అస్మచ్ఛబ్ద వాచ్యత్వాత్ కథం పరోక్షాపరోక్షయోః జీవేశ్వరయోః అద్వైత మితి చేత్ సత్యం అత ఏవ తదాది పదానాం శ్రుతౌ లక్షణా స్వీకృతా భాష్యకారాదిభిః తథా చ సః తచ్ఛబ్ద లక్ష్యార్థః చైతన్య స్వరూపః ఈశ్వరః అహ మస్మచ్ఛబ్ద లక్ష్యార్థః చైతన్య స్వరూపః జీవః ఇతి భవామ్యేవ** - అయ్యా, 'తత్' అను పదము చెప్పబడు ఈశ్వరుడు పరోక్షము కదా! 'అహం' అను పదముచే చెప్పబడు 'జీవుడు' అపరోక్షుడు. మఱి యీ పరోక్ష-అపరోక్షు లయిన జీవేశ్వరులకు అద్వైతము ఎట్లు కుదురును? అన్నచో, నిజమే, కనుకనే 'తత్' అను పదమునకు భాష్యకారుదు మొ॥ వారు లక్షణను స్వీకరించిరి. దానివలన 'తత్' అను పదమునకు లక్షణావృత్తి రీత్యా అర్థమయిన, చైతన్య రూపమయిన, ఈశ్వరుడు, అస్మత్ అను శబ్దమునకు అర్థమయిన నేను 'జీవుడను' అగుదును.

75) **ఏవ శబ్దార్థం స్పష్టమాహ ॥** న దృశ్యరూప ఇతి. **దృశ్యం జ్ఞేయం స్థూల సూక్ష్మ కారణాత్మకం దేహత్రయం (పంచకోశానామత్రైవ అంతర్భావః రూపం స్వరూపం యస్య సః దృశ్యరూపః న భవామ్యేవ** - పైన వ్రాసిన '74' గద్యలో చివఱ 'భవామ్యేవ' అను పదములోని 'ఏవ' గూర్చి చెప్పుచున్నాడు. జీవుడనే అయ్యెదను గాని దృశ్యమయిన, జ్ఞేయమయిన స్థూల సూక్ష్మ కారణ రూపమయిన శరీరత్రయము (దానిలోని పంచకోశములతో సహా) నారూపము కానే కాదని యర్థము.

76) ఏతేన 'నాహం దేహో నేంద్రియాణ్యంతరంగం నాహంకారః ప్రాణవర్గో న బుద్ధిః। దారాపత్య క్షేత్ర విత్తాది దూరః సాక్షీ నిత్యం ప్రత్యగాత్మా శివోహమ్' ఇతి శ్రీ శంకరాచార్య వచనం వ్యాఖ్యాతమ్-పై వివరణము వలన క్రింద వ్రాసిన శంకర యతీంద్ర వచనములు వివరింపబడినవి. అహంకారముగాని, ప్రాణములుగాని, బుద్ధిగాని, భార్య, సంతానము, పొలము, ధనము గాని, దేహముగాని, ఇంద్రియములుగాని మనస్సు గాని-నేను కాను. నిత్యసాక్షినయిన 'ప్రత్యగాత్మ' అయిన శివుడను నేనే॥

77) నాహం దృశ్యరూపః -మయా ఘటాదీనామివ దేహేంద్రియాదీనాం దృశ్యమానత్వేన ద్రష్టుః మమ దృశ్యాత్ దేహేంద్రియాదేః ఘటాదే రివ భిన్నత్వేన భవితవ్యత్వాత్. కింత్వహం దృగ్రూపః ఏవ. దృగ్ద్రష్టా చ ఏక ఏవ. ద్రష్ట్రంతరసత్త్వే పరస్పర దృశ్యత్వ ప్రసంగాత్. అతః న దృశి జీవేశ్వర భేదకల్పనం న్యాయ్యమ్-నేను దృశ్యమయిన ప్రపంచ స్వరూపుడను గాను. కుండలు మొ॥ వానిని చూచినట్లు దేహేంద్రి యాదులను నేనే చూచుచుంటిని. కనుక అవి నాకు దృశ్యములు. నేను ద్రష్టను అనగా చూచువానిని. నాకన్న అవి భిన్నములుగా నుండవలయును. నేను ద్రష్టనే. దృక్ అన్నను ద్రష్ట అన్నను ఒక్కటే. అనగా జ్ఞానము, జ్ఞానియూ ఒక్కరే. 'ద్రష్ట' వేఱు అనుకొన్నచో ఇద్దఱు ద్రష్టలు, పరస్పరము చూడబడుట అనునది ఏర్పడును. కనుక 'దృక్' నందు జీవ, ఈశ్వర భేదము కల్పింపరాదు.

78) మతాంతరోక్త విధయా ఈశ్వరస్య జీవసాక్షిత్వే అభ్యుపగతే తు జీవస్య సాదిత్వేన ఘటాదివత్ అనిత్యత్వం స్యాత్ తచ్చ మహదనిష్టమ్. 'అజో నిత్యః శాశ్వతోయం పురాణః' ఇత్యాది శ్రుతిస్మృతి విరోధాత్, 'ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా' ఇతి శ్రుతేః సర్వదేహేష్వపి ఏక ఏవ జీవస్సాక్షీ- మతాంతరము నందు చెప్పినట్లు (వైష్ణవ) ఈశ్వరుడు జీవసాక్షి అయినచో జీవునకు అనిత్యత్వము వచ్చును. ఘటము మొ॥వానివలె సాదియై అనిత్యుడగును. కాని పైన చెప్పిన

వేదవాక్యములు జీవుని నిత్యుడని, అజుడని చెప్పుచున్నవి. సర్వభూతము లందు అంతరాత్మగానున్నది ఒక్కడే దేవుడని చెప్పుచున్నవి. కనుక శ్రుతిస్మృతి విరోధములు వచ్చుచున్నవి. కనుక సర్వదేహము లందు జీవుడొక్కడే సాక్షి.

79) **నానాత్వం తు భ్రాంతి సిద్ధమేవ-సర్వేష్వపి ఘటేషు యథా ఏక ఏవ ఆకాశః అనుభూయతే న తు నానా తద్వత్. అయం హి దృగ్రూపః సచ్చిదానందః కూటస్థః శుద్ధః నిత్యః ఏకః అత్మా సర్వావభాసకత్వాత్ సర్వజ్ఞః, బుద్ధ్యాది సర్వప్రేరకత్వాత్ అంతర్యామీ, సర్వవ్యాపకత్వాత్ విష్ణుః, దేహాది సర్వదృశ్యేశ్వరత్వాత్ ఈశ్వరః, సర్వాంతరాత్మత్వాత్ నారాయణః, పరమాత్మాచ, కాలత్రయేపి సత్త్వాత్ సద్రూపశ్చ ఈశ్వరో భవతీతి న జీవేశ్వరయోః అల్పోపి భేదః కూటస్థ నిత్య జీవాదన్యస్య ఈశ్వరస్యైవ అసిద్ధేః**-జీవులు అనేకులు అనుకొనుట భ్రాంతి సిద్ధమే. సర్వఘటములందు ఒకే ఆకాశము ఎట్లు కనబడుచున్నదో, అది యెట్లు భిన్నము కాదో సర్వ దేహములందును ఒక్కడే జీవుడు. 'దృక్' అయిన ఈ జీవుడు సచ్చిదానంద రూపుడు. కూటస్థుడు, శుద్ధుడు, నిత్యుడు, ఒక్కడే వాడే అత్మ. సర్వమును ప్రకాశింపజేయువాడు కనుక సర్వజ్ఞుడు, బుద్ధి మొ॥ వానికి ప్రేరణ కలిగించును కనుక అంతర్యామి, సర్వవ్యాపి కనుక విష్ణువు, దేహాది సర్వదృశ్యములకు భిన్నముగానున్నాడు కనుక ఈశ్వరుడు, సర్వాంతరాత్మ కనుక నారాయణుడు, పరమాత్మయు, '3' కాలములందున్నాడు కనుక 'సత్తు', ఈశ్వరుడున్ను అగును కనుక జీవేశ్వరులకు వాస్తవ భేదము లేదు. కూటస్థ నిత్యజీవుని కన్న వేఱుగా ఈశ్వరుడే లేడు.

80) **భేదవాదినస్తు, నిర్వికల్పక సమాధ్యాద్యలాభేన జీవస్య స్వస్వరూప మవిద్వాంసః ప్రమాతృత్వ మేవ జీవస్య తత్త్వం మత్వా ప్రమాతుః కర్తుః భోక్తుః జీవా దన్య మసంసారిణం ఈశ్వరం కూటస్థం బ్రువతే**-భేదవాదులు నిర్వికల్పక సమాధిని ఎఱుగరు. అందువలన వారికి జీవుని నిజస్వరూపము తెలియదు. కనుక ప్రమాతయే జీవుడని తలచి ప్రమాత, కర్త, భోక్త అగు జీవునికన్నను సంసారరహితుడు

అయిన పరమాత్మ వేఱొకడుండెనని ఈశ్వరుని కూటస్థునిగా చెప్పెదరు. ఈ మతమున 'జీవ-ఈశ్వర' భేదము కలదు.

81) న చ యథార్థ మేవేద మమీషాం వచన మితి శంక్యమ్. సుషుప్త్యాదిషు నిర్వికల్పక సమాధౌచ సర్వదృశ్య నిషేధేన కూటస్థాత్మన ఏవ పరిశిష్టత్వాత్ తస్యైవ స్వస్వరూప సుఖానుసంధాతృత్వేన సర్వసాక్షిత్వాత్ సాక్ష్యంతరాభావాచ్చ. తస్మాత్ కూటస్థః నిత్యః జీవ ఏవ ఈశ్వరః'- కాని వారి వాదము యథార్థము కాదు. సుషుప్తి యందును, సమాధి యందును సర్వదృశ్యములు కనబడవు. అప్పుడు కూటస్థమయిన 'ఆత్మ' ఒక్కటే మిగిలియున్నది. ఆత్మయే నిజస్వరూపమును గ్రహించుచున్నది. అదే సర్వసాక్షి, దానికి మఱొక సాక్షి లేదు. కనుక కూటస్థుడు నిత్యుడు అయిన జీవుడే ఈశ్వరుడు.

82) నచాస్య విష్ణ్వాది త్రిమూర్తిధారిత్వే వివదితవ్యమ్, యః సర్వజగన్మూర్తి ధారీ తస్య త్రిమూర్తిధారిత్వే విస్మయానవకాశాత్. అత ఏవ కృతాత్మ సాక్షాత్కారః వామదేవః ప్రతిపేదే, 'అహం మనురభవమ్, సూర్యోహ మభవమ్' ఇత్యాది సర్వాత్మత్వమ్ - అయితే మఱి విష్ణువు మొ॥ త్రిమూర్తులను ధరించినవాడు కూటస్థుడు ఎట్లు అని వివాదము అవసరము లేదు. సర్వజగత్తునే శరీరముగా ధరించిన వానికి 'త్రిమూర్తి' శరీరములను ధరించుట ఒక లెక్కకాదు. కనుకనే ఆత్మ సాక్షాత్కారము పొందిన వామదేవుడు 'నేను మనువునయితిని, నేను సూర్యుడనయితిని' అని తానే (జీవుడే) సర్వస్వరూపుడుగా అయినట్లు చెప్పెను. కనుక జీవుడే దేవుడు. సర్వజగత్‌వ్యాపి.

83) శ్లో॥ దృశ్యం ప్రకల్పిత మిదం మయి మాయయా జ్ఞే,
యావృణ్వతీ మమ భయేవ స చేతనా మామ్।
బ్రహ్మాత్మవృత్తి వినివారిత మాయ చిత్త
వ్యోమ్ని స్ఫురత్స్వరుచయేఽజగతే నమో మే॥

సాక్షినయిన నాయందు ఈ దృశ్యప్రపంచము కల్పింపబడినది. కల్పించబడినది మాయ. నా కాంతి చేతనే ఆక్రమింపబడినదై మాయ

'సచేతన' వలె నన్ను ఆక్రమించినది. బ్రహ్మాకారమయిన అంతఃకరణ వృత్తిలో ఈ మాయను నివారింపగా చిత్తాకాశమున నిజస్వరూపముతో మెఱయుచున్న సంసార భిన్నుడనయిన నాకు అనగా 'ఆత్మ'కు నమస్కరించుచున్నాను.

84) **జానాతీతి జ్ఞః దృక్, సాక్షీ ఇతి యావత్. తస్మిన్ మయి అధిష్ఠానే మాయయా సత్త్వాది త్రిగుణమయ్యా సదసదనిర్వాచ్యయా శక్త్య జ్ఞాన ప్రకృత్యాది పర్యాయయా అనాది భావత్వే సతి జ్ఞాననివర్త్యత్వ రూపలక్షణ లక్షితయా, ఇదం దృశ్యమానం, శ్రూయమాణం, శబ్దేన ప్రతిపాద్య మానం,అనుమీయ మానం, మనసాతర్క్యమాణం, ఆత్మనా అనుభూయ మానం చ సర్వం దృశ్యం బ్రహ్మాదిస్తంబపర్యంతం స్థావరజంగమాత్మకమ్ జగత్ భూతభౌతికరూపం మాయామయ విష్ణ్వింద్రాది శరీరరూపం శ్రీరామాద్యవతారరూపం చ సర్వమపి ప్రకల్పితం ప్రకర్షేణ కృత ముపలక్షణ మిదం రక్షణహననయోః. సర్వదృశ్య కల్పనాధిష్ఠాన భూతః కూటస్థః ఈశ్వరః బ్రహ్మాహమేవ ఇత్యర్థః** – 'జ్ఞః' అనగా తెలిసికొనువాడు అనగా దృక్. సాక్షి అని తాత్పర్యము. నేను ఆ సాక్షిని. నాయందు త్రిగుణమయమయిన మాయగలదు. మాయకు శక్తి అని, అజ్ఞానమని, ప్రకృతి అనియు పేర్లు గలవు. అనాదిగానున్న 'భావ' పదార్థము. ఈ మాయ జ్ఞానముచే నివర్తింపదగినది. అట్టి మాయ నన్ను అధిష్ఠానముగా జేసి ఈ కనబడు వినబడు ప్రపంచమును సృష్టించెను. శబ్దము అనుమానము మొదలైన ప్రమాణములచే తెలియునట్టిది, మనస్సుచే ఊహింపబడునట్టిది, ఆత్మచే అనుభవింప బడునట్టిది,/దృశ్యమయినది, స్థావరజంగమ స్వరూపమయినది బ్రహ్మ నుంచి స్తంబము వఱకు మొత్తము కల్పింపబడినది. భూతములు, భౌతికములు, విష్ణువు, ఇంద్రుడు మొదలగు శరీరములు, రాముడు మొదలగు అవతారములు మొత్తము నాయందు కల్పింపబడినవి. రక్షణ శిక్షణలకు ఇదంతయు బాగా కల్పింపబడినది. కనుక సమస్తదృశ్య కల్పనలకు ఆధారమయిన కూటస్థుడైన ఈశ్వరుడను బ్రహ్మమును నేనే అని అర్థము.

85) నను ఘటాకాశతుల్యాః జీవాః, మహాకాశతుల్య స్తు ఈశ్వరః, అతఏవ 'సత్యపి భేదాపగమే నాథ తవాహం న మామకీనః త్వమ్. సాముద్రో హి తరంగః క్వచన సముద్రో న తారంగః' ఇతి శంకరాచార్యాః ప్రాహుః ఈశ్వర సంబంధిత్వం జీవానామ్, భగవాన్ శ్రీ కృష్ణశ్చ- 'మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః' ఇత్యాహ అంశిత్వ మీశ్వరస్య జీవానాం అంశత్వం చ ఇతి చేత్-అయ్యా! జీవులు ఘటాకాశములవంటి వారు. ఈశ్వరుడు మహాకాశమువంటి వాడు. కనుకనే ఆచార్యశంకరులు 'ప్రభూ! మన యిరువురి మధ్య భేదము లేకున్నను నేను నీ వాడనే కాని నీవు నావాడవు అనరాదు. తరంగము సముద్ర జన్యమే కాని సముద్రము తరంగ జన్యము కాదు గదా!' అనిరి. దీనిని బట్టి జీవులు ఈశ్వర సంబంధులు అని తెలియుచున్నది. అట్లే కృష్ణ భగవానుడున్ను 'నా అంశయే ఈ జీవలోకమున జీవుడయినాడు' అని చెప్పెను.

వీటిని బట్టి జీవులు ఈశ్వరాంశలని, ఈశ్వరుడు 'అంశి' అని తెలియు చున్నది. కనుక జీవేశ్వరులు అభిన్నులగుట ఎట్లు?

86) మైవమ్-నిరంశే ఈశ్వరే అంశాంశిభావస్య కాల్పనికత్వాత్. దేహాదిరూప-ఉపాధీనామేవ ఆత్మని కల్పితత్వేన తదుపహితత్వస్యాపి కల్పితత్వస్య అర్థసిద్ధత్వాత్ - అలాకాదు! ఈశ్వరునియందు భాగములు అంశలు లేవు. ఈ అంశాంశి భావము కల్పితము మాత్రమే. దేహము మొదలగు ఉపాధులు ఆత్మయందు కల్పితములు. వానియందు 'ఆత్మ' యున్నదనుట కల్పన మీద కల్పన మాత్రమే.

87) 'ఏక మేవాద్వితీయం బ్రహ్మ' ఇతి ఉక్తలక్షణే చైతన్యమాత్రే జీవేశ్వర భేదాంగీకారస్య అయుక్తత్వాత్, వ్యవహారతః ప్రతీయమానస్య రజ్జు సర్పవత్ అప్రమాణత్వాత్ - 'బ్రహ్మ, అద్వితీయము, ఏకము' అని వేదవాక్యము. చైతన్య మాత్రమయిన బ్రహ్మయందు 'జీవ ఈశ్వర' అనుభేదము కల్పించుట వేదవాక్య విరుద్ధము. లోక వ్యవహారములో తోచుచున్న యీ భేదము 'రజ్జువునందు తోచు సర్పము' వలె అప్రమాణమయినది గదా!

88) నిర్ధర్మక పరమానందబోధ స్వరూపస్య జీవస్య తాదృశా దేవ ఈశ్వరాత్ యయా కయాపి విధయా భేదస్య దుర్వచత్వాత్, 'త్రివిధపరిచ్ఛేదరహితః విభుః ఆత్మా' ఇతి శ్రీశంకరాచార్యాదిభిః ఉక్తత్వేన తాదృశస్య జీవస్య ఘటాకాశతౌల్య కల్పనాయాం పరిచ్ఛిన్నత్వాది ప్రసంగాచ్చ. కథ మన్యథా ఘటాకాశవత్ జీవాత్మనా మనేకత్వే శ్రుతౌ శ్రూయమాణం, 'ఏకో దేవ' ఇతి ఆత్మనః ఏకత్వం ఉపపద్యేత-సర్వధర్మరహితమయిన అఖండానంద రూపమయినవాడు జీవుడు. ఈశ్వరుడును అట్టివాడే. వీరి మధ్య భేదము ఏవిధముగను చెల్లదు. '3' విధముల భేదములులేని ఈశ్వరుడు ఆత్మ' అని శ్రీ శంకరాచార్యాదులు చెప్పిరి. అట్టి జీవుడు ఘటాకాశముతో సమానుడు అని చెప్పినచో జీవుడు 'విభువు' అనగా సర్వవ్యాపికాడు. ఘటాకాశములవలె జీవులు భిన్నులు అన్నట్లయినచో 'దేవుడు ఒక్కడే ఆయనయే ఆత్మ' అని చెప్పిన వేదవాక్యములు ఎట్లు కుదురును?

89) నను యది ఆత్మా కూటస్థః ఏక ఏవ ఈశ్వరః. తత్ర కల్పితాః రామకృష్ణాద్యవతారాః దేవదత్తాదివత్ ఇతి అభ్యుపగమ్యేత, తర్హి రామకృష్ణాదీనాం ఈశ్వరావతారత్వ వ్యవహారః, దేవదత్తాదీనాం జీవత్వవ్యవహారశ్చ కథ మితి చేత్-అయ్యా ఆత్మ, కూటస్థుడు, ఈశ్వరుడు ఒక్కడే ఆయనయందు కల్పింపబడిన రామకృష్ణాది అవతారములు దేవదత్తాదులవంటివి అని అంగీకరించినచో, మఱి రామకృష్ణాదులు ఈశ్వరావతారములు ఎట్లు అయిరి. దేవదత్తాదులు జీవులు ఎట్లు అయిరి. ఈ తేడా ఎలా వచ్చినది?

90) ఉచ్యతే, నాస్తి హి మాయాయాం ఆక్షేపః నామ. యయా సర్వ మఘటితం ఘటితమ్. యథా పుత్రికాజీవీ స్వాయత్తాసు సర్వాసు పుత్రికాసు మధ్యే కాశ్చన హనుమద్రామాది పుత్రికాః ఉత్కృష్టత్వేన గృహీత్వా తాభిః అపకృష్టాః రాక్షస పుత్రికాః నాశయతి, తద్వత్ బ్రహ్మణి మాయా రామాదీన్ రావణాదీన్ దేవదత్తాదీంశ్చ కల్పయిత్వా తత్ర రామాది దేహైః రావణాది దేహాన్ మారయతి, దేవదత్తాది దేహాన్ రక్షయతిచ, తత్ర యే శిష్టరక్షకాః దుష్టశిక్షకాశ్చ రామాదిదేహాః తాన్ ఉత్కృష్టత్వేన

**ఈశ్వరావతారాన్ మన్యతే లోకాః నికృష్టాంస్తు జీవానితి** - మాయ యందు సంభవాలు అసంభవాలు మొదలైన ఆక్షేపములకు అవకాశము లేదు. అసంభవములనిపించునవి సంభవించును. తోలుబొమ్మలాటవాడు తన చేతిలోనున్న బొమ్మలలో హనుమంతుడు, రాముడు మొ॥ బొమ్మలను గొప్పవిగా గ్రహించి అధమముగా గ్రహించిన రాక్షసులు మొ॥ బొమ్మలను పై బొమ్మల చేత నాశనము చేయించును. అట్లే 'మాయ' బ్రహ్మయందు రాముడు మొ॥ వారిని, రావణుడు మొ॥ వారిని, దేవదత్తుడు మొ॥ వారిని కల్పించి రామాది శరీరములచేత రావణాది శరీరములను చంపించి దేవదత్తాది శరీరములను రక్షించును. ఇందులో 'శిష్టరక్షణ, దుష్టశిక్షణ' చేసిన రామాది శరీరములను ఉత్కృష్టమైనవి కనుక లోకులు వారిని ఈశ్వరావతారములుగా చెప్పుచున్నారు. తక్కువ వారిని జీవులుగా చెప్పుచున్నారు అని.

91) **అయం నిష్కర్షః. 'న జాయతే మ్రియతే వా విపశ్చిత్' ఇతి శ్రుతేః. ఆత్మా న జాయతే. నాపి మ్రియతే. స హి ఈశ్వరః. దేహాస్తు జాయంతే మ్రియంతే చ. తత్ర ఏకస్మాత్ దేహాత్ అన్యో జాయతే, ఏకేన దేహేన అన్యో మ్రియతే రక్ష్యతే చ. యథా పితుః పుత్రః, రామేణ రావణః రామేణ సుగ్రీవశ్చ, ఆత్మా తు 'నాయం హంతి న హన్యతే' ఇతి స్మృతేః హంతృ హంతవ్యభావదూరః ఏవ** - సారాంశము ఏమనగా, 'ఆత్మ మరణించదు పుట్టదు' అని వేదము. దీనిని బట్టి ఆత్మకు చావు పుట్టుకలు లేవని స్పష్టము. ఆయన ఈశ్వరుడే. దేహములు మాత్రము పుట్టును గిట్టును. అందులో ఒక దేహమునుంచి మఱొక దేహము పుట్టును. ఒకడు మఱొక దేహము వలన చచ్చును. రక్షణ పొందును. ఉదాహరణ తండ్రివలన పుత్రుడు జన్మించును. రాముని చేతిలో రావణుడు చచ్చును. రాముని వలన సుగ్రీవుడు రక్షణపొందును. 'ఆత్మ' మాత్రము 'చంపదు చంపబడదు' అను గీతావచనము వలన ఈ 'చంపు-చంపబడు' అను వ్యవహారమునకు దూరమే.

92) **ఏవం దేహేష్వివ ప్రాణేంద్రియాదిష్వపి తారతమ్యం అస్త్యేవ. తత్ర యః ఓజస్తేజోబలవాన్ త మీశ్వరం బ్రువంతి, యః తద్రహితః తం**

**అనీశ్వర మితి కాల్పనిక ఏవాయం ఈశ్వరానీశ్వర వ్యవహారః. తస్మాదేక ఏవాత్మా కూటస్థ నిత్య సచ్చిదానందః ఈశ్వరః**-ఇలాగే దేహము లందున్నట్లు ప్రాణ, ఇంద్రియాదులయందును 'తేడా' గలదు. వారిలో ఓజస్సు తేజస్సు బలము గలవాడు ఈశ్వరుడు అని చెప్పెదము. అవి లేనివాడు ఈశ్వరుడు కాదని చెప్పెదము. కనుక ఈశ్వరానీశ్వర వ్యవహారము కల్పనాసిద్ధమే. కనుక ఒక్కటే ఆత్మ. కూటస్థమయినది, నిత్యమయినది, సచ్చిదానందమయినది. అదే ఈశ్వరుడు.

93) **రామకృష్ణాది దేహాంతర్వర్తినః అస్మదాది దేహాంతర్వర్తినశ్చ బుద్ధి తాదాత్మ్యాధ్యాసం ప్రాప్య వ్యవహరంతః ప్రమాతారస్తు జీవా ఇతి వ్యవహ్రియంతే. అమీష్వేవ బహు అస్తి తారతమ్యమ్. యదాశ్రయాత్ రక్ష్యరక్షక, జన్యజనకత్వాది భేదవ్యవహారోపపత్తిః** - రామకృష్ణాది దేహములలోనున్నను, మనవంటివారి దేహములో నున్నను ఈ ఆత్మలు 'బుద్ధి' తో తాదాత్మ్యమును పొంది వ్యవహారము చేయువారు కనుక జీవులే, ప్రమాతలే. వీరి యందే గొప్ప తారతమ్యముగలదు. ఈ తారతమ్యమును బట్టి రక్షణ ఇచ్చువారు పొందువారు, పుట్టువారు, కనువారు అనుభేదము వచ్చినది.

94) **అంతఃకరణావచ్ఛిన్నం చైతన్యం ప్రమాతా ఇతి ఉచ్యతే. ఏకస్యైవ ఈశ్వరచైతన్యస్య అంతఃకరణావచ్ఛేదవశాత్ ప్రమాతృత్వమ్, స్వతః తు ఈశ్వరత్వ మితి వివేకః** - చైతన్యము ఒక్కటే. అది అంతఃకరణముతో కూడినపుడు 'ప్రమాత' అందురు. అంతఃకరణముతో కలియనపుడు అనగా స్వతహాగా ఉన్నపుడు 'ఈశ్వరుడు'. ఇదే తేడా. కనుక ఒకే చైతన్యము అంతఃకరణాన్ని బట్టి జీవుడు లేకపోతే ఈశ్వరుడు.

95) **అత ఏవ ప్రమాతృషు విశేషణాంశ ఏవ కల్పితః, న తు విశేష్యాంశః ఇతి కృత్వా చైతన్యే ప్రమాతృత్వం కల్పితం ఇత్యుక్తమ్** - కనుక ప్రమాతలయందు విశేషణ భాగమయిన అంతఃకరణము కల్పితము. విశేష్యమయిన చైతన్యము వాస్తవము. కాగా 'చైతన్యము' వాస్తవము. 'ప్రమాతృత్వము' కల్పితము.

96) ద్వైతిన స్తు ప్రమాతృసాక్షిణం కూటస్థం ఆత్మానం అవిద్వాంసః ప్రమాతార మేవ ఆత్మానం మన్యమానాః కూటస్థాత్ తస్మాత్ ఈశ్వరాత్ ఆత్మనః సకాశాత్ బిభ్యతి. ఉక్తం హి శ్రుత్యైవ. భీషాస్మా ద్వాతః పవత. ఇత్యాది – ద్వైతులు (అనగా ఈశ్వరుడు వేఱు జీవుడు వేఱు అని భావించువారు) ప్రమాతకు సాక్షి అయిన కూటస్థ చైతన్యమును (ప్రత్యగాత్మ) ఎఱుగక ప్రమాతనే 'ఆత్మ' గా భ్రమించి కూటస్థుడయిన పరమాత్మకు భయపడుచున్నారు. ద్వైతవాదుల కీ భయము తప్పదు. శ్రుతి యిట్లు చెప్పినది. 'ఈ మహాభూతము నుండి భయపడి గాలి వీచును'

97) యస్తు అద్వైతీ కూటస్థ మాత్మానం ఈశ్వరం వేత్తి సః న కుతోపి బిభేతి, ద్వితీయస్యైవాభావాత్ 'ద్వితీయాద్వై భయం భవతి' ఇతి శ్రుతేః యః ఏవం అద్వితీయ బ్రహ్మాత్మవిత్ ప్రమాతా స హి స్వగతం ప్రమాతృత్వాంశం అసత్యం విధూయ బ్రహ్మైవ భవతి. 'బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి' ఇతి శ్రుతేః. యస్తు ద్వైతీ స హి 'మృత్యోస్స మృత్యు మాప్నోతి, య ఇహ నానేవ పశ్యతి' ఇతి శ్రుతేః, సంసారాత్ సంసారమేవ ప్రాప్నోతి (పునః పునః జాయతే మ్రియతే చ ఇత్యర్థః)–అద్వైతి అయిన వాడు కూటస్థుడైన ఆత్మయే తానని తెలియును. వానికి ఎవరి నుంచియు భయము లేదు. '2'వ వాడే లేడు కనుక 'రెండవవాని నుంచి భయము కలుగును' అని వేదము. ఇట్లు అద్వితీయమయిన బ్రహ్మను తెలిసికొన్న ప్రమాత తనలోని 'ప్రమాత' అనబడు అంతఃకరణమును వదలి 'బ్రహ్మత్వ' మును మిగిల్చికొనును. బ్రహ్మయే అగును. 'బ్రహ్మవేత్త బ్రహ్మయే అగును' అని శ్రుతి. 'ద్వైతి' అయినవాడు 'మృత్యువు వలన మృత్యువును పొందును' అను వేదమును బట్టి సంసారము నుండి సంసారమునకు జేరును. (అనగా పుట్టుచు గిట్టుచుండును.)

98) నను అద్వితీయ స్వప్రకాశ చైతన్యే కథం మాయయా ఇదం సృష్ట మతః అహ– యేతి. యా మాయా మమ ఏవ ఈశ్వరస్య భయా –కాంత్యా ప్రతిబింబేనేతివా. సచేతనా భూత్వేవ మాం ఆత్మానం ఆవృణ్వతీ ఆచ్ఛాదయంతీ భవతి, తయా మాయయా ఇతి పూర్వేణ

అన్వయః-అయ్యా!, అద్వితీయమయిన ప్రకాశరూపమయిన చైతన్యము నందు 'మాయ' దీనినంతను ఎలా సృష్టించినది? అనుప్రశ్నను ఊహించి సమాధానముగా శ్లోకములో '2'వ పాదము చెప్పుచున్నాడు. ఈశ్వరుడ నయిన నా కాంతితో సచేతనమయినట్లున్న మాయ లేదా నా ప్రతిబింబము వలన సచేతనమయిన మాయ నన్నే ఆవరించును. అట్టి మాయ నాయందు అనగా ఈశ్వరునియందు ఇదంతయు సృజించును అని సమన్వయము.

99) ప్రచండాతపే పేచకానుభవ సిద్ధాంధకారవత్ ఆత్మని ప్రమాత్రనుభవ సిద్ధ మజ్ఞానం న కేనాపి వారయితుం శక్యమ్-అస్మాత్ అజ్ఞానాత్ అస్మాకం ప్రమాతౄణాం నిర్ధర్మక పరమానంద బోధస్వరూప కూటస్థాత్మ దర్శనం నాసీత్-అంగులినా నేత్రే పిహితే సూర్యదర్శనవత్ - ప్రచండ మయిన ఎండలో "గుడ్లగూబ"కు అంధకారము అనుభవమయినట్లు, 'ఆత్మ' వెలుగుచున్నను ప్రమాతకు అజ్ఞానము అనుభవములో ఉండును. ఈ అజ్ఞానమును నివారించుట శక్యము కాదు. ఈ అజ్ఞానము వలననే మనవంటి ప్రమాతలకు నిర్గుణ సచ్చిదానంద స్వరూపమయిన ఆత్మను దర్శించుటకు సాధ్యమగుట లేదు. వ్రేలితో కళ్ళు మూసికొన్న వారికి ఎంత వెలిగినను సూర్యుడు కనబడడు గదా!

100) యథా మేఘాః గగన మావృత్య తత్ర నీలిమానం జనయంతి తథా మాయా స్వప్రకాశమపి ఆత్మానం ఆవృత్య తత్ర ప్రమాతౄన్ జనయంతీతి తత్త్వమ్ - మేఘములు ఆకాశమును ఆవరించి అచ్చట 'నల్లదనములను' కలిగించును. అలానే 'మాయ' స్వయంప్రకాశమయిన ఆత్మను ఆవరించి దాని యందు అనేక ప్రమాతలను పుట్టించుచున్నది. ఇది తత్త్వము.

101) న చ సూర్యస్య తమ ఇవ స్వప్రకాశస్య కథం ఆవరణ మితి వాచ్యమ్? సూర్యతమసోరివ న మాయాత్మనోః బాధ్యబాధకభావః, కింతు స్వప్రకాశేన ఆత్మనైవ భాస్యతే మాయేయమ్. ఏవ మపి యద్యసంతోషః తవ తర్హి కాలత్రయేపి ఆత్మని మాయా నాస్త్యేవ. తత్ప్రతీతిస్తు అస్మాకం భ్రాంతిరేవేతి పూర్వోక్తం స్మర. న హి భ్రాంతౌ కోపి వివాదః. రజ్జుం

**సర్పమివ ఆత్మానం మాయయా వృతమ్ మన్వామహే వయమ్, న తు సః వృతః ఇతి భావః** – అయ్యా! సూర్యునికి చీకటి ఆవరణము కాదు గదా! మఱి స్వయం ప్రకాశమానుడయిన ఆత్మను మాయ ఎట్లు ఆవరించును. అని ప్రశ్న. సమాధాన మేమనగా, సూర్యునికి చీకటికి శత్రుత్వము కలదు. కాని మాయకు ఆత్మకు అట్టి విరోధము లేదు. పైగా స్వయంప్రకాశమయిన ఆత్మ వలననే మాయ భాసించును (మబ్బులు సూర్యునివలన పుట్టినట్లు) లేదా అసలు ఆత్మ యందు త్రికాలములలోను 'మాయ' లేదు. 'మాయ' మనకు తోచుట మాత్రము మన భ్రాంతియే. అను విషయమును స్మరింపవలయును. 'భ్రాంతి' విషయములో కలహము లేదు గదా! రజ్జువును సర్పమును వలె ఆత్మను, మాయావరణమును భ్రాంతిచే గుర్తించెదము. అంతే తప్ప 'బ్రహ్మ మాయావృతుడు' అని అర్థము కాదు. మనమే భ్రాంతిపడితిమని భావము.

102) **ఏతావతా మాయయా తావత్ ఆత్మస్వరూప మావృతం, పశ్చాత్ ఆత్మని దృశ్య మిదం కల్పిత మితి మాయాయాః ఆవరణవిక్షేపశక్తిద్వయం దర్శితమ్. మాయాకర్తృకాత్ ఆత్మస్వరూపావరణాత్ 'ఆత్మా' నాస్తీతి, విక్షేపాదహం సంసారీతి చ లోకః ప్రతిపద్యతే ఇతి బోధ్యమ్** – దీనినిబట్టి, మాయ ఆత్మస్వరూపమును ఆవరించునని, తరువాత 'ఆత్మ' యందు ఈ దృశ్యము కల్పింపబడినదని తేలుచున్నది. కాగా 'మాయ'కు ఆవరణశక్తి, విక్షేపశక్తి అను '2' శక్తులు గలవని చెప్పినట్టుఅయినది. మాయచేసిన ఆవరణము వలన 'ఆత్మ' లేదని, విక్షేపము వలన 'నేను సంసారి' నని లోకము భ్రాంతి పడుచున్నది. అని ఎఱుగవలయును.

103) **ఏతేన చ మాయయైవ ఆత్మనః సంసారః ఇతి సిద్ధమ్. మాయయా ఆనాత్మతాదాత్మ్యాధ్యాసః తతః సంసారః ఇతి సిద్ధాంతాత్. అనుభవసిద్ధ మిదం సుషుప్త్యాదౌ అధ్యాసాభావాత్ సంసారాదర్శనమ్. శ్రూయతేచ– 'తత్ర కేన కం పశ్యే దిత్యాది. జగద్రూపకార్యానుమేయా చేయం మాయా స్వత ఏవ ఆత్మని ఆసీత్. మాయా చ అవిద్యా చ స్వయమేవ భవతి'**

ఇతి శ్రుతేః - దీనివలన తెలినదేమనగా 'ఆత్మ'కు మాయవలననే సంసారము అని మాయవలన ఆత్మేతర పదార్థముతో ఆత్మకు ఏకత్వము భావించుట దానివలన సంసారము అని సిద్ధాంతము. సుషుప్తి మొదలగువానియందు అధ్యాస లేదు కనుక సంసారము కనబడదు. కనుకనే సంసారము లేనిచోట అధ్యాసలేనిచోట 'ఎవరుదేనితో ఏమిచూచెదరు' అని శ్రుతి. ప్రపంచమున్నదికనుక 'మాయ' ఉన్నదని యూహించెదము. ఈమాయ బ్రహ్మయందు స్వతహా ఉన్నదే. 'మాయ' అవిద్య స్వయముగనే ఏర్పడును అని వేదము.

104) అథాస్యాః నివారణోపాయ మాహ-బ్రహ్మేతి - మాయను నివారించు నుపాయము 'బ్రహ్మ-' మొదలగుపాదముతో చెప్పుచున్నాడు.

105) బ్రహ్మాత్మవృత్తిః, అహం బ్రహ్మాస్మి ఇతి అఖండాకారా వృత్తిః. అంతః కరణపరిణామః, జాయతే చేయం 'తత్త్వమసి'-ఆది మహావాక్యార్థ శ్రవణ మననాదినా। తయా వినివారితా మాయా అజ్ఞానం 'నాస్తిబ్రహ్మ, నాహం బ్రహ్మ' ఇత్యాకారకం యస్య తస్మిన్ చిత్తే వ్యోమ్ని హృదయాకాశే స్ఫురతే, భాసమానాయ స్వరుచయే స్వయం జ్యోతిషే అజగతే నిష్ప్రపంచాయ మే ఈశ్వరాయ మహ్యం నమః ప్రహ్వీభావః అస్తు ఇతి శేషః-'బ్రహ్మాత్మవృత్తి' అనగా 'నేను బ్రహ్మను' అను అఖండాకార మయిన వృత్తి. దీనికి కారణము 'తత్త్వమసి' (అతత్వమే నీవు) అను మహా వాక్యజ్ఞానము. దీనిచేత మాయ అనగా అజ్ఞానము నివారింప బడును. 'బ్రహ్మములేదు నేను బ్రహ్మను కాను'అను భావనయే అజ్ఞానము. అదే మనస్సు అను హృదయాకాశము నందు నివారింప బడును. అట్టి హృదయమునందు ప్రకాశించువాడు, స్వయం జ్యోతి, ప్రపంచరహితుడు ఈశ్వరుడు అయిన నాకు నమస్కారము.

106) నమస్కర్తా ప్రమాతా, నమస్కార్యస్తు ఆత్మా ఇతి వివేకః. సంసారభయదర్శ నాదుద్విగ్నః శమాదిసాధనసంపన్నః తీవ్రముముక్షుః పురుషధౌరేయః గురుశాస్త్రాభ్యాం బ్రహ్మాభిన్నం ఆత్మానం విదిత్వా సమాహితః సన్ తత్ర సర్వేతర వృత్తివిలయేన నిద్రారాహిత్యేన చ ప్రశాంతగంభీరస్య

**మనసః అఖండ చైతన్యాకారయా వృత్త్యా ఆత్మస్వరూపావరణ మజ్ఞానం అతపేన తమః ఇవ నాశయిత్వా సచ్చిదానందలక్షణం ఆత్మానం సాక్షాత్కరోతి** – నమస్కరించువాడు ప్రమాత. నమస్కరింపదగినవాడు 'ఆత్మ' అని తేడా. సంసారభయమునకు తొణకనివాడు, శమదమాది సాధనములు గలవాడు, తీవ్రమయిన మోక్షవాంఛ గలవాడు, ఉత్తమ పురుషుడు అయినవాడు, గురువు ద్వారా శాస్త్రము ద్వారా తాను బ్రహ్మమునేనని గ్రహించును. తరువాత సమాధిగ్రస్తుడై సర్వ–ఇతర వృత్తులు వదలికొని నిద్రమాని, ప్రశాంత గంభీరమయిన మనస్సుతో బ్రహ్మాత్మభావన చేయుచుండును. అప్పుడు ఉదయించిన అఖండ బ్రహ్మాకారవృత్తి ఆత్మకు అవరణ మయిన అజ్ఞానమును 'ఎండ చీకటిని పోగొట్టినట్లు' నాశనము చేయును. దానివలన సచ్చిదానందరూపమున 'ఆత్మ' సాక్షాత్కరించును. అనగా స్వస్వరూపము తెలియును.

107) **సాక్షాత్కృతే చ తస్మిన్ స్వస్మిన్ ప్రమాతృత్వాది లక్షణం సంసారం మృషాభూత మితి విదిత్వా కూటస్థం నిత్యం ఈశ్వరమేవ ఆత్మానం ప్రత్యేతి. న కదాపి విస్మరతి. స్వస్మిన్ భ్రాంతి విస్మరణాద్యయోగాత్. సాక్షాత్కారాత్ ప్రాక్తు అజ్ఞానసత్త్వాత్ తదుపపత్తిః. తస్మాత్ మాయాతమిస్ర వినివారక – అఖండాకారవృత్తి సూర్యోత్పాదనాయ వేదాంతశ్రవణాదికం కర్తవ్యం – ఉక్తం చ శ్రుత్యా,– 'ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యః మంతవ్యః నిదిధ్యాసితవ్యః' ఇతి. తర్కాదికం తు న పఠనీయమ్. 'అన్యా వాచో విముంచథ. ఇతి శ్రుతేః** – బ్రహ్మ సాక్షాత్కారము తరువాత సాధకునకు తనయందున్న 'ప్రమాత' అను లక్షణము, దానివలన వచ్చిన సంసారము మిథ్య అని తెలిసికొనును. కూటస్థుడు నిత్యుడు అయిన ఆత్మయే తానని తెలిసికొనును. ఎన్నటికి మఱవడు. తనను తాను ఎన్నటికి మఱవడు. సాక్షాత్కారమునకు ముందు అజ్ఞానమున్నది కనుక తనను తాను తెలిసికొన లేకపోవుటకు అవకాశము కలదు. కనుక మాయా తిమిరము పోగొట్టుటకు 'అఖండాకార వృత్తి' అను సూర్యుడు పుట్టవలయును. అందుకు వేదాంతశ్రవణము మొ॥

చేయవలయును. అదే శ్రుతి చెప్పినది. 'ఓయీ! ఆత్మను గూర్చి శ్రవణము చేయవలయును, దర్శింపవలయును, మననము చేయ వలయును. ధ్యానింపవలయును' అని. తర్కశాస్త్రము మొ॥ ద్వైతవాదములు చదవరాదు. 'ఇతర వాక్యములను వదల వలయును' అని శ్రుతి గదా!

108) శ్లో॥ ధర్మాన్ విహాయ వివిధాన్ శరణం భజేహం
మా మేక మేవ వినివర్తత ఏవ మాయా
కార్యేణ యేన చ సమం మయి వా రమంతే
శర్వాదయః కిము మదన్య దముత్ర భద్రమ్" – సర్వధర్మములను పరిత్యజించి నేను నన్నే (పరమాత్మనే) శరణు గోరుచున్నాను. దీనివలన మాయ తన కార్యమయిన 'అధ్యాస'తో సహా తానే నివర్తించును. శివాది దేవతలు కూడా నాయందే (ఆత్మ) 'రమింతురు' నన్ను మించిన మంగళవస్తువు ఇంకేమి కలదు?

109) అహం అహం శబ్ద వాచ్యార్థః ప్రమాతా వివిధాన్ నిత్యాన్ నైమిత్తికాన్ కామ్యాన్ నిషిద్ధాంశ్చ సర్వాన్ ధర్మాన్ శ్రౌతాన్ స్మార్తాన్ ఆగమికాంశ్చ విధీన్ 'చోదనా లక్షణోర్థో ధర్మః', ఇతి మీమాంసా సూత్రమ్. విహాయ మాం అస్మచ్ఛబ్ద లక్ష్యార్థం కూటస్థ నిత్యం చిదానంద మీశ్వర మాత్మాన మేకమేవ సజాతీయ విజాతీయ స్వగత భేదాభావాత్ ఇతి భావః. శరణం రక్షకం భజే – పై శ్లోకములోని పదములకు ఇది వ్యాఖ్య – 'అహం' అనగా 'నేను' అని భావించు ప్రమాత. నిత్యములు, నైమిత్తికములు, కామ్యములు, నిషిద్ధములు అయిన సకల వేద స్మృతి ప్రోక్తమయిన విధులను వదలిపెట్టెదను, (ధర్మమనగా వేదము ప్రేరణ చేసిన కర్మలు అని మీమాంస.) నన్ను అనగా 'అస్మత్' అను శబ్దమునకు పరోక్షార్థమయిన కూటస్థ, నిత్య, చిదానంద స్వరూప సజాతీయ, విజాతీయ స్వగత భేదములు లేని ఆత్మను శరణు గోరెదను.

110) కిం తయా ఆత్మశరణాగత్యా ఫలమ్? అత ఆహ. మాయాకార్యేణ అధ్యాసేన సమం సహ యేన ఆత్మశరణాగత్యా వినివర్తత ఏవ. సత్సంప్రదాయ సిద్ధోయ మర్థః ఇత్యాహ–శర్వాదయః మయ్యేవ రమంతే–

'శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే' ఇతి, 'రమంతే యోగినో నంతే సత్యానందే చిదాత్మని' ఇతిచ స్మృతేః. 'ఆత్మరతిః ఆత్మక్రీడః' ఇతి శ్రుతేశ్చ - ఈ ఆత్మశరణాగతికి ఏమి ఫలము అనగా చెప్పు చున్నాడు. అధ్యాసము అనగా 'బ్రహ్మమును ప్రపంచముగా భావించుట' మాయవలన వచ్చిన భ్రాంతి. ఆత్మ శరణాగతి వలన అమాయ, ఈభ్రాంతియు నివర్తించును. ఇదే సత్సంప్రదాయము. శివుడు మొదలగు వారు గూడ 'ఆత్మ' యందే రమించెదరు. అని వాక్యములు గలవు. 'శ్రీరామ రామ రామ' అనుచు నేను రమించెదను అని శివుడు పార్వతికి చెప్పెను. యోగులు తమ జ్ఞానస్వరూపమయిన ఆత్మయందు రమించెదరు కనుక 'ఆత్మ'కు రాముదని పేరు. అని స్మృతి వాక్యము. భగవంతుని గూర్చి చెప్పుచు 'ఆత్మయందు రమించువాడు ఆత్మయందు క్రీడించువాడు' అని వేదము.

111) **కుత ఏత దత ఆహ!- మత్ - ఆత్మనః అన్యత్ అముత్ర భద్రమ్ అమితమంగళం వస్తు కిము కిమస్తి, న కిమపి ఇత్యర్థః. ఆత్మాన్యస్య సర్వస్యాపి జడదుఃఖానృత రూపత్వాత్ ఆత్మన్యేవ విద్వాంసః రమంతే అవిద్వాంసస్తు ఆత్మానం సచ్చిదానందం మాయయా వృతం అవిదిత్వా ప్రమాతారం రాగాద్యంతఃకరణదోష క్షుభిత మాత్మానం జ్ఞాత్వా సచ్చిదానందరూపః జగజ్జన్మాదిహేతుః పరమాత్మా కశ్చిత్ మత్తోపి అన్యః అస్తీతి భ్రమిత్వా తం పారోక్ష్యేణ 'అహం బ్రహ్మాస్మి' ఇతి ఉపాసతే. తతోపి మూఢాః ఆత్మానమివ పరమాత్మాన మపి ప్రమాతారం సర్వజ్ఞం మత్వా సేవ్యసేవకభావేన ఉపాసతే తమ్, తతోపి అతిమూఢాః ఆత్మానం మనుష్యం మన్యమానాః పరమాత్మానం చ శంఖచక్రాదిధారిణం దేవం మన్యమానాః శేషశేషిభావేన తం భజంతే. నాత్ర విస్మయః కార్యః. యః మాయయా దేహాదివిలక్షణ మాత్మానమేవ మనుష్యం మన్యతే తస్య కిం పునః వక్తవ్యం అన్యస్మిన్ ఈశ్వరే దేవబుద్ధిః ఇతి** - ఇట్లు చెప్పుటకు కారణము ఏమనగా, నాకు నా (ఆత్మ) కన్న అమిత మంగళమయిన వస్తువు ఏమి కలదు. ఆత్మ తప్ప మిగిలిన ప్రపంచ

మంతయు జడము దుఃఖావృతము. కనుక విద్యాంసులు తమయందే తాము ఆనందపడెదరు. అపండితులు మాయావృతుడయిన పరమాత్మను గూర్చి తెలియక, రాగము ద్వేషము మొదలగు అంతఃకరణదోషములచేత మలినుడయిన ప్రమాతనే (చిదాభాసునే) ఆత్మగా భావించెదరు. సచ్చిదానంద రూపుడయిన జగత్కారణుడయిన 'పరమాత్మ' వేఱే ఉన్నాడని భావించి భ్రమించి ఆయనను పరోక్షముగా 'అహంబ్రహ్మాస్మి' అని సేవించెదరు. ఇంకను మూఢులయినవారు 'ఆత్మ' వలెనే 'పరమాత్మ' గూడా ప్రమాత అని నమ్మి (రాగద్వేషములు గలవాడని నమ్మి) సర్వజ్ఞుడనియు నమ్మి 'సేవ్యుడు ఆయన-సేవకుడు తాను' అని అర్చన చేయుచుండెదరు.వారికన్న అతిమూఢులైనవారు తమను మనుష్యులుగా భావించికొని పరమాత్మను శంఖచక్రాదిధారి అయిన దేవునిగా తలచి 'ఆయన శేషి-మనము శేషము' అని సేవించుచుందురు. ఈ విభిన్నధోరణులు ఆశ్చర్యము కావు. మాయవలన వీరు దేహాది భిన్నుడయిన ఆత్మను దేహముతో కల్పి మనుష్యునిగా భావించుచున్నారు. మఱి వీరికి ఈశ్వరునియందు 'వేఱే మఱొక దేహము' అను భ్రాంతి కలుగుటలో ఆశ్యర్య మేమి?

112) **ఇద మత్ర బోధ్యమ్. దేవత్వమనుష్యత్వాదయః దేహధర్మాః. కాణత్వ బధిరత్వాదయః ఇంద్రియధర్మాః, కామసంకల్పాదయః మనోధర్మాః. క్షుత్పిపాసాదయః ప్రాణధర్మాః, ప్రమాతృత్వం తు సచ్చిత్ప్రతిఫలనాంతః కరణ తాదాత్మ్యాధ్యాసాత్ ఆత్మని కల్పితం మాయయా కామిత్వ సుఖిత్వాదివత్** - ఇది యిచ్చట తత్త్వము. దేవత్వము మనుష్యత్వము మొదలగు దేహగుణములు; గ్రుడ్డి, చెవిటి మొదలగు ఇంద్రియ గుణములు; కోరికలు, సంకల్పములు మొదలగు మనోధర్మములు; ఆకలి, దప్పిక మొదలగు ప్రాణధర్మములు. ప్రమాత అనగా అంతః కరణమునందు సత్యజ్ఞానమయిన 'ఆత్మ' శక్తి సోకుటవలన 'ఆత్మ' యందు మాయ చేత 'కామిత్వము సుఖిత్వము' కల ధర్మము. అనగా అంతఃకరణ ధర్మములయిన కామ, సుఖ - మొదలగు ధర్మములు

ఆత్మయందు ఆరోపింపబడుట. 'నేను సుఖిని' అని భావించుట 'ప్రమాత' లక్షణము.

113) సచ్చిదానంద బ్రహ్మాత్మబోధేన నష్టే చ తస్మిన్ అధ్యాసే కథం ఆత్మనః ప్రమాతృత్వమ్? న కథంచిదపి. 'దేహాత్మ ప్రత్యయో యద్వత్ ప్రమాణత్వేన కల్పితః, లౌకికం తద్వదేవేదం ప్రమాణం త్వాత్మనిశ్చయాత్' ఇతి వచనాత్. యథా లౌకికానాం దేహాత్మ ప్రత్యయః 'దేవదత్తోహం మనుష్యోహం' ఇత్యాదిః ప్రమాణసిద్ధః, యథా చ వైదికానాం దేహాతిరిక్తః కర్తా భోక్తా ప్రమాతా ప్రమాణసిద్ధః తథా వేదాంతినాం అకర్తా అభోక్తా ఆత్మా ప్రమాణసిద్ధః ఏవ – 'సచ్చిదానంద స్వరూప బ్రహ్మమునే నేను అను జ్ఞానము కలిగిన తరువాత 'అధ్యాస' నశించును. అపుడు 'ఆత్మ' ప్రమాత కాదు. 'దేహమునందు ఎట్లు సామాన్యులకు 'ఆత్మ' అనుభావన కలిగినదో అట్లే వేదాంతులకు 'ఆత్మ'యే తాము అను నిశ్చయము కలుగును అని వృద్ధవచనము. 'నేను దేవదత్తుడను, నేను మనుష్యుడను' అని లోకమున దేహమే ఆత్మగా భావన గలదు. అట్లే వైదికులకు అనగా మీమాంసకులకు కర్త భోక్త ప్రమాత అయిన జీవుడు కలడు. అదే అనుభవ ప్రమాణముతో, ఉపనిషత్ప్రమాణముతోను వేదాంతులకు 'అకర్త అభోక్త అను కూటస్థుడయిన ఆత్మ' సిద్ధించును.

114) పరం తు వైదికానాం దేహాత్మప్రత్యయః అప్రమాణః, జ్ఞానినాం తు దేహాత్మప్రత్యయః, ప్రమాత్రాత్మ ప్రత్యయ శ్చ ఇతి ఉభయం అప్రమాణమ్. – అయితే దేహాత్మభావము ఒక్కటే అప్రమాణమని వైదికులు భావించెదరు. దేహాత్మ వాదమే కాక 'ప్రమాతయే జీవుడు' అను వైదికుల వాదము గూడా అప్రమాణమని జ్ఞానుల మతము.

115) యతః ఏవం తతః ఆత్మతత్త్వస్వరూపనిశ్చయపర్యంత మేవ ప్రమాత్రాత్మ ప్రత్యయస్య ప్రామాణ్యం, న తతః పశ్చాత్. యః ఇదం ఆత్మస్వరూపం సచ్చిదానంద లక్షణం వేత్తి సః కథం ధర్మాన్ కుర్యాత్, క్రియాణాం ఆత్మకర్తృత్వ పూర్వకత్వాత్. న హి అకర్త్రాత్మని క్రియాసమవాయః. కర్తృత్వం తు మిథ్యాజ్ఞాన పూర్వక మితి ఉక్తమ్ – కనుక ఆత్మస్వరూపము

ంవగాహన అగునంతవఱకు మాత్రమే 'ప్రమాత-అత్మ' అను భావన నిలుచును. ఆత్మస్వరూపమును తెలిసికొనినవాడు క్రియారూప ధర్మములను చేయడు. ఆత్మ సచ్చిదానందస్వరూపము కదా! దానికి కర్తృత్వము ఫలానుభవము లేవు. 'క్రియలు' అన్న తరువాత మనలో 'కర్తృత్వము' ఏర్పడును. కర్తృత్వము అనునది అంతోయింతో దేహాభిమానముతో కలిసియుండును. ఇది మిథ్యాభిమానము. కర్తృత్వము లేని ఆత్మయందు 'క్రియలు' ఇట్లు చేరును.

116) **కింతు సః విద్వాన్ సదా స్వస్వరూపానుసంధానమేవ కుర్యాత్. ఫలం తు తస్య సర్వదుఃఖనాశః, పరమానందావాప్తిశ్చ. అనుభవసిద్ధం హి సుషుప్తౌ ఇదం ద్వయం సర్వేషామ్. సౌప్తికానందానుభవస్తు నిద్రయా ఆవృతః. సమాధౌ తు స్పష్టః ఆవరణాభావాత్ ఇతి వివేకః** - కాని విద్వాంసుడు అయినవాడు నిత్యము స్వస్వరూపమును దర్శించుచుండును. దీనివలన సమస్త దుఃఖములు నశించును. పరమానందము లభించును. సుషుప్తిలో ఈ '2' ను ప్రత్యక్షమే కదా! అయితే, 'సుషుప్తి' వలన వచ్చిన ఆనందము నిద్రతో ఆవరింపబడినది. సమాధియందు ఆవరణ ఉండదు కనుక స్పష్టముగా నుండును.

117) **యస్య తు అదృష్టాభావాత్ నిర్వికల్పకసమాధిః దుర్లభః సః విద్వాన్ సర్వదాపి ఆత్మస్వరూపాది ప్రతిపాదకాన్ వేదాంతాన్ పురాణాదీన్ వా అభ్యసేత్. 'ఆసుప్తేరామృతేః కాలం నయే ద్వేదాంతచింతయా' ఇతి స్మరణాత్. ఆత్మ శరణాగతిం చ స్మరంతి. తచ్చింతనం తత్కథనం అన్యోన్యం తత్ప్రబోధనమ్ ఏతదేకపరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః ఇతి బ్రహ్మాభ్యాస ఏవ ఆత్మశరణా గతిః** - అదృష్టము లేనికారణముగా 'నిర్వికల్పక సమాధి' లభించని విద్వాంసుడు 'ఆత్మ' ప్రతిపాదకములయిన వేదాంతము పురాణము మొదలగు వానిని అభ్యసింపవలయును. 'నిద్రించు వఱకును, మరణించు వఱకును, వేదాంత చింతనతో కాలము గడుపవలయును. 'అని స్మృతి మఱియు, ఆత్మశరణాగతిని చేయవలయును. 'బ్రహ్మచింతనము, బ్రహ్మకథనము అన్యోన్యము బ్రహ్మ

విషయ చర్చ, బ్రహ్మమీదనే ధ్యాస' - దీనిని బ్రహ్మాభ్యాసము అందురు. ఇదే 'ఆత్మశరణాగతి'.

118) **శ్రూయతే చ-ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యః మంతవ్యః నిదిధ్యాసితవ్యః' ఇతి. యః ఏవం ఆత్మస్వరూపశ్రవణమననాదితత్పరః పరిత్యక్త తదితర ధర్మః తమేవ జీవన్ముక్త మాహుః** – శ్రుతి గూడా పై వాక్యములో 'ఆత్మను దర్శింపవలయును, మననము చేయవలయును ధ్యానము చేయవలయును' అని చెప్పినది. ఇట్లు ఆత్మ స్వరూప పరిశీలనా తత్పరుడయి సర్వకర్మ ధర్మములను సన్యసించినవాడే 'జీవన్ముక్తుడు' అని చెప్పెదరు.

119) **దగ్ధవస్త్రవత్ అబంధకస్సన్ దేహేంద్రియాదిసంసారః యస్య అస్తి సః జీవన్ముక్తః. దేహాదీనాం భౌతికానాం భూతేషు లయాత్ విదేహముక్తః ఇతి వివేకః** – తగులబడి అట్లే నిలిచియున్న వస్త్రమువలె ప్రభావ రహితమయిన సంసారాభాసము గలవాడే జీవన్ముక్తుడు. వాడే భౌతికమయిన దేహాదులు మరణానంతరము పంచభూతములలో కలియగా 'విదేహముక్తుడు' అగును. ఇది తారతమ్యము.

120) **అపిచ అస్య ఆత్మతత్త్వవిదః ప్రాణోత్క్రమణవ్యథాపి న విద్యతే. 'తత్త్వ విదః ప్రాణాః నోత్క్రామంతి' ఇతి శ్రుతేః యుక్తం చేదమ్ యస్య ముమూర్షోః యాదృశీ భావనా సః పుమాన్ ప్రాణేంద్రియాదిభిః సాకం తాదృశం దేహం ప్రతిపద్యతే, 'యాంతే మతిః సా గతిః' ఇతి న్యాయాత్. జ్ఞానీ తు భావనారహిత స్సన్ అథవా బ్రహ్మాత్మభావన స్సన్ వర్తతే ఇతి కథం తస్య దేహాంతరప్రాప్తి హేతుభూతం ప్రాణోత్క్రమణమ్. న కథంచిదపి-ఇత్యర్థః.** – పైగా ఆత్మతత్వవేత్తకు ప్రాణోత్క్రమణబాధ గూడా లేదు. 'తత్వవేత్త యొక్క ప్రాణములు పైకి పోవు' అని వేదము. ఇది యుక్తమే. మరణకాలమున ఎట్టి భావనగలదో అట్టిరూపమునే పొందును అని చెప్పెదరు గదా! 'మరణమునందు ఏ మతియో అదేగతి' అని న్యాయము. జ్ఞాని అయినవాడు భావనారహితుడై బ్రహ్మాత్మ భావన గలవాడై ఉండును కనుక వానికి బ్రహ్మత్వము ప్రాప్తింపవలెను. అట్టి

వానికి దేహాంతరము పొందుటకు ప్రాణములు ఎక్కడికి పోవును. సర్వవ్యాపి అయిన బ్రహ్మమున లీనమగును.

121) **తస్మాత్ జన్మజరామరణాది దుఃఖ సంసార సముద్రం తితీర్షుః కుశలః ఆత్మాన మేవ పోతం శరణం గచ్ఛేత్ - ఆత్మరూప యాథార్థ్య జ్ఞానం వినా ఆత్మని కల్పితస్య ప్రమాత్రాది ప్రపంచస్య అనపాయాత్** - కనుక జన్మ, జర, మరణము మొదలగు దుఃఖమయమయిన సంసార సముద్రమును దాటదలచినవాడు తననే అనగా 'ఆత్మ' నే శరణుగోరవలయును ఆత్మస్వరూపము యథార్థముగా ఎఱుగని వానికి 'ఆత్మ' యందు కల్పింపబడిన 'ప్రమాత' మొదలగునవి ప్రపంచము మొదలగునవి అసత్యములని తెలియదు.

122) న హి రజ్జుజ్ఞానం వినా రజ్జుకల్పిత సర్పభ్రమః నివర్తతే. ధర్మేషుతు నైవ సజ్జేత్-తేషాం **ఆత్మస్వరూప విస్మారకత్వాత్ అనాత్మభ్రాంతిజనకత్వా చ్చ-ఆత్మ స్వరూపసాక్షాత్కారానంతరం తు సూర్యోదయానంతరం తమ ఇవ మాయా సకార్యా నైవతిష్ఠతి. ఏనం ఆత్మాన మేవ శరణం ప్రపద్య బ్రహ్మవిష్ణురుద్రాది వత్ సనకాది యోగి జనకవచ్చ జీవన్ముక్తత్వేన సుఖేన వర్తితవ్యం విపశ్చిద్భిఃపరమాత్మాన మిమం భూమానందం ప్రపద్య గంగాం ప్రపద్య మరుమరీచికా జలే ఇవ విద్వాన్ ప్రసజ్జతే న క్షుద్రసుఖేషు ధర్మేషు కథమపి** - 'త్రాడు' అని తెలియనిదే దానియందు ఏర్పడిన 'సర్పము' అను భ్రాంతి పోదు. సంసార ధర్మములందు సాగరాదు. అవి ఆత్మస్వరూపమును మఱపించును. ఆత్మకాని వాని యందు అవే ఆత్మ అని భ్రాంతి కలిగించును.కాని ఆత్మస్వరూప సాక్షాత్కారము తరువాత 'సూర్యోదయము తరువాత చీకటి వలె' మాయ, దానివలన వచ్చిన అధ్యాస తొలగి పోవును. ఇట్లు 'ఆత్మ'నే శరణువేడి బ్రహ్మ విష్ణు రుద్రాదులవలె, సనకాదియోగులవలె, జనకునివలె, జీవన్ముక్తులై సుఖముగా నుండదగును. గంగను చేరినవాడు ఎండమావు లలో నీటి వెంట పడడు. అట్లే బ్రహ్మానంద స్వరూపుడైన పరమాత్మను పొందినవాడు అల్పసుఖముల వెంటపడడు. అల్పధర్మముల వెంటపడడు.

123) యస్తు బహిర్ముఖః సన్ అవిదితాత్మానందః సః స్వగృహబిలస్థం హిరణ్యనిధిం అవిద్వాన్ హి పురుషః ధనాశయా రాజసేవాదిష్వివ ధర్మాదిషు సజ్జతే. తస్మాత్ ఆత్మ శ్రవణ కథన మనన, నిదిధ్యాసన రూపాత్మశరణాగతిం వినా సర్వే ధర్మాః పరిత్యాజ్యాః ఆత్యంతిక సుఖాభిలాషిణా మనీషిణా - తనయింట ఒక బిలములో బంగారు నిధి ఉన్నదని తెలియని నరుడు ధనవాంఛతో రాజసేవ కొఱకు సిద్ధపడును. అట్లే బహిర్ముఖుడైన వ్యక్తి తనలోని ఆత్మానందము నెఱుగక ఇతర సంసార విషయములలో సాగును. కనుక 'ఆత్మ' ను గూర్చి వినుట, చెప్పుట, తలచుట, ధ్యానించుట మొదలగు ఆత్మ శరణాగతి తప్ప మిగిలిన సంసార ధర్మములు వదలవలయును. ఈ పనిచేయ వలసినవాడు శాశ్వత సుఖమును గోరుపండితుడు.

124) ఇద మేవ హి గీతాశాస్త్రాంతే ఉక్తమ్ - 'సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ' ఇతి. 'తరతి శోక మాత్మవిత్' ఇతి శ్రుతిశ్చ శోకతరణే ఆత్మజ్ఞానమేవ సాధన మాహ. న తు ధర్మాచరణమ్ - గీతా శాస్త్రముచివఱయిదే చెప్పబడినది. 'సకల ధర్మములను వదలి నన్ను ఒక్కనినే శరణుగోరుము' అనియు, 'ఆత్మవేత్త శోకమును దాటును' అను వేదము గూడా శోకము తీర్చుకొనుటకు ఆత్మజ్ఞానమే సాధనమని చెప్పినవి. అంతే తప్ప ధర్మాచరణము శోక తరణ సాధనము కాదు.

125) అనభిసంహితఫలానాం విహితానాం ధర్మాణాం తు ఆత్మ స్వరూప వివిదిషాయాం ఉపయోగః. 'త మేవం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి' యజ్ఞేన దానేన తపసా నాశకేన' ఇతి శ్రుత్యాభిహితః - ఫలవాంఛలేని విహితకర్మలను ధర్మములను ఆచరించుటవలన ఆత్మ స్వరూపజ్ఞానమునకు చిత్తశుద్ధిరూపమార్గము ఏర్పడును. అదే కర్మ ధర్మముల ప్రయోజనము. 'ఆ పరమాత్మను బ్రహ్మవేత్తలు యజ్ఞ దాన తపస్సులతో తెలిసికొనగోరెదరు' అని వేదము చెప్పినది.

126) ఇహ జన్మని జన్మాంతరే వా అనుష్ఠిత ధర్మవశాత్ ఉత్పన్నవివిదిషస్య తు ఆత్మశరణాగతి రేవ కృత్యమ్, న తు అన్యత్. వివిదిషా నామ

**దృఢజిజ్ఞాసా ఇతి సిద్ధాంత లేశ సంగ్రహే ప్రపంచితా. తస్మాత్ శమాది సాధన సంపన్న! భో ముముక్షో త్వం సద్గురు చరణం ప్రపద్య తత్ప్రసాదేన ఆత్మశ్రవణ ముపలభ్య తన్మనన నిదిధ్యాసనే విధాయ తత్వరూపం సాక్షాత్కృత్య స్వాశ్రితశిష్యేభ్యః తదేవ ఉపదిశన్ సమాధ్యాదౌ తదేవ అనుభవన్ ఆత్మైకశరణః శంకరాదివత్ సర్వలోకపూజ్యః శాశ్వత జ్ఞానానందఘనః వర్తస్వ** – ఈ జన్మలో మఱొక జన్మలోనో చేసిన పుణ్యవశమున 'బ్రహ్మజిజ్ఞాస' పుట్టిన వానికి 'ఆత్మశరణాగతి' యే కర్తవ్యము. వివిదిష అనగా దృఢమయిన బ్రహ్మ జిజ్ఞాస. అని సిద్ధాంత లేశ సంగ్రహమున కలదు. శమము మొదలగు సాధనములు గల ఓ మోక్షకామా! సాధకా! నీవు సద్గురుచరణముల చెంతచేరి ఆయన ద్వారా 'ఆత్మ' గూర్చి శ్రవణము చేయవలయును. తరువాత మననము ధ్యానము చేయవలయును. అలా బ్రహ్మ స్వరూపమును సాక్షాత్కరించి కొని తన శిష్యులకు గూడ అదే ఉపదేశించుచు సమాధి యందున్ను అదే అనుభవించుచు ఆత్మమాత్ర శరణ్యుడవై శంకరాదుల వలె సర్వలోకపూజ్యుడవై శాశ్వత జ్ఞాన ఆనందఘనుడవై ప్రవర్తింపుము.

127) **యస్తు శారీరక భాష్యాదిగ్రంథాభిప్రాయజ్ఞానాలసః సః తత్వజిజ్ఞాసుః పురుషః ఇమం అద్వైతామృతం గ్రంథం పఠిత్వా స్వస్వరూపం జ్ఞాత్వా పరమానందఘనో భవతు**–శారీరకభాష్యాది గ్రంథమును తెలిసికొన జాలని అల్పమేధావంతుడయిన నరుడు తత్వము తెలియ గోరినచో ఈ 'అద్వైతామృత' గ్రంథమును పఠించి స్వస్వరూపమును తెలిసికొని పరమానందఘనుడు అగుగాక!

శ్రీ బెల్లంకొండ రామకవి కృతులలో
వేదాంతములను అనుసరించి వ్రాసిన
**'అద్వైతామృతము'**
శ్రీ హయగ్రీవార్పణము అయినది.
కీలక సం॥ జ్యేష్ఠ బహుళ చతుర్దశ
శ్రీః

# వేదాంతనిశ్చయః

శ్రీ బెల్లంకొండ రామరాయ కవి
(1875 - 1914)

శ్లో॥ దృగ్బ్రహ్మ దృశ్యం మాయా చే-త్యస్తి వస్తుద్వయం తయోః।
దృశ్యం సర్వాత్మనా జాత-మనుస్యూతం దృశాఖిలమ్॥ 1

**తాత్పర్యము:-** దృక్ అని, దృశ్యము అని '2' వస్తువులు కలవు. దృక్ అనగా 'చూచునది'. అని అర్థము. చూచుట అనునది 'జ్ఞానము' కనుక 'దృక్' అనగా బ్రహ్మము. దృశ్యము అనగా చూడబడునది. అది మాయ అనగా కనబడుచున్న 'విశ్వము'. 'దృశ్యము' అంతయు పుట్టినది. అనగా అంతకు ముందు లేనిది. తరువాత పుట్టినది. కనుక ముందెప్పుడయినా నశించునది. ఈ దృశ్యమునందు అనుస్యూతముగా అనగా అంతర్యామిగా పూసలలో దారమువలె 'దృక్' అనగా బ్రహ్మము ఉండును.

శ్లో॥ తద్బ్రహ్మ ద్వివిధం భూయః-పూర్ణావచ్ఛిన్న భేదతః।
ఆకాశవ త్తత్ర పూర్ణం-పరోన్య ప్రత్యగుచ్యతే॥ 2

**తాత్పర్యము:-** 'దృక్' అనగా బ్రహ్మము. 2 విధములు 1) పూర్ణము 2) అవచ్ఛిన్నము. ఆకాశమువలె సర్వవ్యాప్తమయిన చైతన్యము పూర్ణము. దానినే పరమాత్మ అందురు. అట్లు గాక శరీరములయందు ఉన్న 'ఆత్మ' అవచ్ఛిన్నము. అనగా పరిమితము. ఉదాహరణ. సర్వవ్యాప్తముగానున్న ఆకాశము పూర్ణము. అది పరమాత్మవంటిది. అట్లుగాక ఒక ఘటమునందో, మన శరీరమునందో పరిచ్ఛిన్నముగా (Seperated) నున్న ఆకాశము (ఖాళీ ప్రదేశము) అవచ్ఛిన్నము. దీనినే 'ప్రత్యగాత్మ' అందురు. సారాంశము ఏమనగా 1) పరమాత్మ - సర్వవ్యాపి 2) ప్రత్యగాత్మ - దేహవ్యాపి.

శ్లో॥ 'అవచ్ఛేదక మేతస్య-త్వంతఃకరణ ముచ్యతే।
మమకారాహంకృతిభ్యాం-మాయయా వికృతం చ తత్'॥ 3

**తాత్పర్యము:-** ఈ ప్రత్యగాత్మకు అంతఃకరణము అవచ్ఛేదకము. అనగా ప్రత్యగాత్మ అంతఃకరణమున ప్రతిబింబించును. సూర్యుడు ఒక అద్దములో

ప్రతిబింబించినట్లు శరీరములోని ప్రత్యగాత్మ అను 'జ్ఞానము' 'అంతఃకరణము' అను ఒక జడ యంత్రములోనికి వ్యాపించును. ఈ అంతఃకరణము మాయవలన అహంకార మమకారములవలన వికారము అనగా మార్పు చెందును. అనగా అద్దమునందు రంగులున్నట్లు అంతఃకరణమున అహంకార మమకారములు ఉండును.

శ్లో|| 'అహంకార స్తత్ర కర్తా - భోక్తా జీవః స్మృతో బుధైః
మమకారో మనో బుద్ధిః చిత్తం చేత్యుచ్యతే బుధైః'. 4

**తాత్పర్యము:-** ప్రత్యగాత్మ వ్యాపించిన యీ అంతఃకరణమునందున్న అహంకార భాగము జీవుడు. ఈతడే కర్త, భోక్త, మమకార భాగము మనస్సు, అనిపించి కొనును. దీనినే బుద్ధి, చిత్తము అనియు అందురు.

శ్లో|| తదేత దంతఃకరణమ్-వస్తుతో జడమప్యథ|
చిద్ధర్మాధ్యాసతః స్వస్మిన్-మాయికాత్ చేతనం స్మృతమ్|| 5

**తాత్పర్యము:-** ఈ అంతఃకరణము ఒక జడపదార్థము. ఒక 'కంప్యూటర్' వంటిది. కాని దీనియందు ప్రత్యగాత్మ యొక్క జ్ఞానధర్మము సోకుట వలన 'చైతన్యము' కలదయినది. ఈ సోకుటకు కారణము 'మాయ'. అనగా కంప్యూటరు నందు 'కరెంటు' సోకుటవలన అది చైతన్యమువలె అనగా మనిషివలె అన్ని పనులు చేయుచున్నది. అట్లే ప్రత్యగాత్మ యొక్క అధ్యాసవలన జడ - అంతః కరణము 'నేను' అను భావనను పొందినది.

శ్లో|| 'శృణోతి పశ్యత్యత్తీదం-జిఘ్రతి వ్యాకరోతి చ|
తత్తదింద్రియ సాహాయ్యాత్-సుఖదుఃఖే ప్రయాతి చ|| 6

**తాత్పర్యము:-** అంతఃకరణ ప్రతిబింబితమయి 'జీవుడు' అనబడు ఈ చైతన్యము ఆయా ఇంద్రియముల సహాయముతో, వినును, చూచును, తినును, వాసన చూచును వ్యాఖ్యానించును. సుఖదుఃఖములను అనుభవించును.

శ్లో|| దేహ తాదాత్మ్యత శ్చైతత్-జాయతే మ్రియతేఽపి చ,|
భోగాయ కర్మ కురుతే-భుంక్తే కర్తుం కృతిం తథా|| 7

**తాత్పర్యము:-** ఈ జీవుడు 'దేహము తాను ఒక్కటే' అనుకొనుట వలన 'మరణము, జననము' అనునవి అనుభవించుచున్నాడు. నిజమునకు జనన

మరణములు దేహమునకు చెందినవే. దేహమునకు తనకు మధ్యభేదము గుర్తించకపోవుటచే జీవుడే తాను జనన మరణములను అనుభవించుచున్నట్లు భావించును. ఉదాహరణ 'కంప్యూటర్' కు జననమరణములుండును. అందలి 'కరంటు' కు అవి చెందవు. ఘటము పుట్టును పగులును. కాని అందలి ఆకాశము (ఖాళీ ప్రదేశము) పుట్టదు పగలదు. అట్లే దేహమున్ను. అందలి ఆత్మకు ఏమియు కాదు. కాని తాదాత్మ్యము (తనే అది అనుకొనుట) వలన జీవునకు జనన మరణభ్రాంతి కల్గును. అనుభవించుటకే కర్మములను చేయును. చేయుటకే కర్మలను అనుభవించును. దేహాభిమానము వలన దేహము చేయు కర్మలకు తాను బాధ్యుడగును. ఫలములకై కర్మలను చేయును. ఆ ఫలములను అనుభవించుటకు మఱల కర్మములను చేయును.

శ్లో॥ అస్యేయం సంసృతిః ప్రత్య-గాత్మన్యారోపితాబుధైః।
నీలతేవ ఘటస్యాభ్రే-నిర్వికారస్య వా స్వయమ్'॥ 8

**తాత్పర్యము:-** ఈ అంతఃకరణము(జీవుని) యొక్క సంసారమును మనము 'ప్రత్యగాత్మ' యందు ఆరోపించికొనుచున్నాము. అందుకు కారణము మన అజ్ఞానము. ఉదాహరణ-నల్లని కుండలో ఆకాశము అనగా శూన్యము కలదు. కుండను బట్టి అదియును 'నల్లగా' నున్నట్లు భావించెదము. అట్లే, శుద్ధమయిన 'ప్రత్యగాత్మ' పై అంతఃకరణ ధర్మములయిన సంసార సుఖదుఃఖములను ఆరోపించుట లోకములో జరుగుచున్నది.

శ్లో॥ 'ద్వా సుపర్ణా' ఇతి బ్రూతే-శ్రుతి శ్శ్లోకార్థ మేవ సా
సాక్షిణం ప్రత్యగాత్మానం-భోక్తారం జీవ మేవ చ' 9

**తాత్పర్యము:-** 'ద్వాసుపర్ణా -' అను మంత్ర తాత్పర్యము 'ఒక సమానమయిన రావిచెట్టు పై ఇద్దఱు సుపర్ణులు (గరుత్మంతులు) గలరు. వారిలో ఒకరు 'రావి' సంబంధమయిన పదార్థమును అనుభవించుచుండెను. రెండవవాడు తినకయే ప్రకాశించుచున్నాడు' అనగా సమానమయిన అశ్వత్థ వృక్షము అనగా అశాశ్వతమయిన మన శరీరము లేదా మన సంసారము. అశ్వత్థము=రేపు ఉండనిది అని యర్థము. దీనియందు నివసించు గరుత్మంతులు. 1) ప్రత్యగాత్మ, 2) అంతఃకరణము లేదా జీవుడు. ఇందులో ప్రత్యగాత్మ శుద్ధ సచ్చిదానంద

మయుడై ప్రకాశించును. జీవుడు సంసార / దేహ సంబంధమయిన సుఖ దుఃఖములను అనుభవించును.

శ్లో॥ ప్రత్యగ్జీవావివేకేన-ప్రతీచ్యాపాతతః స్ఫురన్
సంసారో వినివర్తేత-వివేకేన తయోః పునః' 10

**తాత్పర్యము:-** 'ప్రత్యగాత్మ-జీవాత్మ' వీని మధ్య ఉన్న భేదము తెలియక పోవుటవలన జీవుని సంసారమును ప్రత్యగాత్మయందు ఆరోపించికొనుచున్నాము. దానివలన సంసారదుఃఖములు అనుభవములోనికి వచ్చుచున్నవి. అట్లుగాక ప్రత్యగాత్మ – అంతఃకరణము (జీవ) మధ్య తేడాని తెలిసికొన్నచో ఈ సంసారము తొలగును.

శ్లో॥ ప్రతీచో లక్షణం దృక్త్వం-దృశ్యత్వం జీవలక్షణమ్
ఇమం విభాగం విజ్ఞాయ-దృశం దృశ్యాద్వివేచయేత్' 11

**తాత్పర్యము:-** ప్రత్యగాత్మకు జీవాత్మకు తేడా ఏమనగా, ప్రత్యగాత్మ 'దృక్' అనగా ద్రష్ట. జ్ఞానస్వరూపుడు. జీవుడు అనగా అంతఃకరణము దృశ్యము. అనగా జ్ఞేయము=తెలిసికొనదగినది. ఈవిభాగమును బట్టి 'దృక్' అనగా ద్రష్టను, జ్ఞానమును దృశ్యము నుండి అనగా జ్ఞేయము నుండి విడదీయవలయును. అప్పుడు 'ద్రష్ట' అయిన వానికి సంసారము లేదు. తాను జ్ఞానస్వరూపుడనని తెలియును.

శ్లో॥ అహంకారో జ్ఞాయతే వా-మమాయమితి సాక్షిణా
అహంకారస్య జన్మాంతౌ-జాగ్రత్సుప్త్యోశ్చ నిశ్చియాత్' 12

**తాత్పర్యము:-** 'సాక్షి' అయిన ప్రత్యగాత్మకు 'మమ అయమ్' అనగా 'ఇది నాది' అను అహంకారము తెలియును. ఈ అహంకారము జాగ్రద్దశలో అనగా మెలకువ దశలో పుట్టును. నిద్రాదశలో (సుప్తిలో) అంతరించెను. ఆవిధముగా అహంకారమునకు జనన మరణములు గలవు. కాని ప్రత్యగాత్మ మాత్రము శాశ్వతముగా నుండి ఈ జనన మరణములకు నిద్రా జాగరణ దశలకు సాక్షిగా నుండును.

శ్లో॥ నాత్మా సంవేద్యతేన్యేన-స్వయమేవ స్ఫురత్యతః।
స్వయం ప్రకాశ ఇతి చ-ప్రోచ్యతే వేదమూర్ధభిః॥ 13

**తాత్పర్యము:-** ఈ 'ప్రత్యగాత్మ' జ్ఞానస్వరూపము సూర్యుని వంటిది. ఇది స్వయముగా ప్రకాశించును. దీనిని మనకు ప్రకాశింపజేయునది లేదా తెలియ జేయునది వేఱేమియులేదు. సూర్యుడే మనకు అన్నింటిని ప్రకాశింపజేయును. తానే ప్రకాశించును. అంతేగాని సూర్యుని ప్రకాశింపజేయుటకు వేఱే దీపము అక్కఱలేదు గదా! అట్లే 'ఆత్మ' ప్రకాశ రూపము. జ్ఞాన రూపము. కనుక దీపమువలె తనే ప్రకాశించును.

శ్లో॥ సర్వావభాసక స్సోయం-సర్వసాక్షీ పరః పుమాన్।
అజో నిత్యః శాశ్వతశ్చ-ప్రత్యగాత్మా స్వయంప్రభుః॥ 14

**తాత్పర్యము:-** ఈ ప్రత్యగాత్మ సర్వమును ప్రకాశింపజేయును. సర్వమును తెలియజేయును. సర్వమును తెలిసికొనియుండు సాక్షి ఆయనయే. ఆయనయే పరమాత్మ. పుట్టుక లేనివాడు=అనాది. అనంతుడు, శాశ్వతుడు. స్వయం సమర్థుడు. సర్వశక్తిమంతుడు జ్ఞానస్వరూపుడు అయిన పరమాత్మయే దేహ పరిమాణమును బట్టి 'ప్రత్యగాత్మ' గా చెప్పబడుచున్నాడు.

శ్లో॥ 'జాయతే మ్రియతే జీవః-సంసారీ దృశ్యతేపిచ,।
ఏవం వివేచితే స్వస్మిన్-సంసారో న మనాగపి॥ 15

**తాత్పర్యము:-** పై పద్యముతో కలిపి దీనిని చదువవలెను. ఈ '2' శ్లోకము లందు 'ప్రత్యగాత్మ, జీవాత్మల' మధ్య వివేకమును వివరించినాడు. అందు ప్రత్యగాత్మ లక్షణము పై శ్లోకమున గలదు. ఈ శ్లోకమున 'జీవ' లక్షణము చెప్పబడినది. 'జీవుడు' సంసారి. అతను అంతఃకరణమును బట్టి లింగశరీరము కలవాడు. లింగశరీరమునకు స్థూల శరీరాభిమానము పోదు. అందువలన జీవునకు చావు పుట్టుకలు, సంసారబంధములు కలవు. ఈ విధముగా వివేచన చేసినచో అంతఃకరణ యంత్రము నుండి అందువలన వచ్చిన బంధములనుండి వ్యక్తి విడివడును. తాను 'ఆత్మ' నని తెలిసికొనును. అనగా జ్ఞాన స్వరూపుడై మిగులును ప్రత్యగాత్మయందు అజ్ఞాన రూపమయిన సంసారమాయ తొలగును.

శ్లో॥ తద్వివిక్తం చ నిర్ద్వైత స్వరూపం ప్రత్యగాత్మనః।
చిదానందమయం సత్యం భూమరూపం సుమంగళమ్॥ 16

**తాత్పర్యము:-** 'ప్రత్యగాత్మ' యొక్క స్వరూపము భిన్నమయినది. అంతః

కరణముతోను సుఖదుఃఖములతోను సంబంధము లేనిది. ద్వైతములేనిది. అనగా 'ప్రత్యగాత్మ' ఒక్కటే. బ్రహ్మరూపమయినది. సత్యము శివము సుందర మయినది. ఆనందమయము జ్ఞానమయము.

శ్లో॥ సాక్షాత్సమాధౌ యః పశ్య-త్యయమస్మీతి పూరుషః।
తస్య ద్వైతమిదం సర్వం-మృషైవ ప్రతిభాసతే॥ 17

**తాత్పర్యము:-** సమాధిలో ఏయోగి ఈ ప్రత్యగాత్మ సాక్షాత్కారము పొందునో ఆయనకు ఈ 'ద్వైతభావన' నశించును. ఈ సంసారమంతయు ఒక స్వప్నము వలె మిథ్యగా స్పష్టమగును.

శ్లో॥ ఆత్మా సత్యో మృషా సర్వ-మితి యస్య వినిశ్చయః।
పరిచ్ఛిన్నం కథం వింద్యాత్-ప్రత్యగాత్మాన మేష సః॥ 18

**తాత్పర్యము:-** 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా' అన్నట్లు ఆత్మ సత్యము. ఇతర మంతయు అసత్యము అని నిశ్చయము కలిగిన యోగికి ప్రపంచమంతయు ఆత్మరూపముగా కనబడును. మిగిలినదంతయు జడపదార్థముగా మాయాకృతమయిన మిథ్యగా తెలియును. అట్టిచో దేహమునందలి 'ప్రత్యగాత్మ' పరిమితమని యెట్లు భావింప గలడు. సర్వవ్యాపి అయిన 'పరమాత్మయే' అని తెలిసిన తరువాత 'ప్రత్యగాత్మ' వేఱు అను అవివేకము నశించును కదా!

శ్లో॥ వినష్టాయాం చ మాయాయాం-సకార్యాయాం ధియానయా।
శిష్యతే ప్రత్యగాత్మైవ-కేవల బ్రహ్మరూపతః॥ 19

**తాత్పర్యము:-** మాయ అనగా జీవుని అజ్ఞానము. అది నశించినచో దానివలన వచ్చిన దేహాభిమానము, సంసారము గూడా తొలగిపోవును. అపుడు ప్రత్యగాత్మయే 'పరమాత్మ' గా సర్వవ్యాపి అయిన బ్రహ్మగా అనుభవమునకు వచ్చును.

శ్లో॥ తత్త్వమస్యాది వేదాంత-మహావాక్యాన్యపి స్వయమ్,।
ఇద మేవాద్వైత తత్త్వం-లక్షయంతి విలక్షణమ్॥ 20

**తాత్పర్యము:-** 'తత్ త్వమసి' మొదలగు వేదాంత వాక్యములు సహితము (వీనినే మహావాక్యములు అందురు.) ఈ అద్వైతతత్త్వమునే తెలుపును. అనగా సర్వవ్యాప్తమయిన జ్ఞానస్వరూపమయిన 'ఆ బ్రహ్మమే నీవు' అని ఆ వాక్యముల

అర్థము. శరీరేంద్రియాదులకన్న విలక్షణమయిన ఆ 'శుద్ధజ్ఞానమే' బ్రహ్మతత్వము.

1. ప్రజ్ఞానం బ్రహ్మ - ఋగ్వేద వాక్యము, ఐతరేయోపనిషత్తు
2. అహంబ్రహ్మాస్మి - యజుర్వేదము, బృహదారణ్యకోపనిషత్తు
3. తత్త్వమసి - సామవేదము, ఛాందోగ్యోపనిషత్తు
4. అయమాత్మాబ్రహ్మ - అథర్వణవేదము, ముండకోపనిషత్తు

ఇవి వేదవాక్యములు వీనినే మహా వాక్యములు అందురు. బ్రహ్మ స్వరూపమును జీవయథార్థ స్వరూపమును చెప్పిన వాక్యములు ఇవియే.

**శ్లో॥ పూర్ణం బ్రహ్మ తదర్థః స్యాత్-అవచ్ఛిన్నః త్వ మర్థకః॥**
**అస్యర్థైక్యాసంభవేన-ద్వయోః లక్ష్యార్థః ఆశ్రితః॥ 21**

**తాత్పర్యము:-** 'తత్ త్వం అసి=తత్త్వమసి' ఈ వాక్యమునకు అర్థము ఏమనగా,

తత్ = పూర్ణ అనగా అఖండమయిన బ్రహ్మము.
త్వం = నీవు అనగా పరిచ్ఛిన్నమయిన జీవాత్మవు
అసి = అగుచున్నావు అని అర్థము

కాని బ్రహ్మము=అఖండము సర్వజ్ఞము, సర్వవ్యాపి, సర్వశక్తిమంతము; జీవుడు= ఖండస్వరూపుడు, అల్పజ్ఞుడు, దేహవ్యాపి, అల్పశక్తిమంతుడు. ఇంత తేడా ఉన్నపుడు వీరి మధ్య అభేదము ఎట్లు పొసగును? ఈ వాక్యముల అర్థమెట్లు కుదురును? అని ప్రశ్న దీనికి సమాధానము తరువాతి శ్లోకము.

**శ్లో॥ అవచ్ఛిన్నత్వ పూర్ణత్వ-విరుద్ధార్థ ప్రహాణతః॥**
**చైతన్యమేవ లక్ష్యార్థః-తచ్చాద్వైత మఖండకమ్॥ 22**

**తాత్పర్యము:-** చైత్రుడు, మైత్రుడు అను ఇద్దఱు గలరు. వారు బజారున నడచుచుండిరి. వారికి 'దేవదత్తుడు' అనువాడు కనబడెను. వానిని చైత్రుడు గుర్తు పట్టెను. దేవదత్తుడు వారి బాల్య మిత్రుడు. కాని మైత్రుడు దేవదత్తుని గుర్తు పట్టలేదు. కారణము, దేవదత్తుని అతడు చాల బాల్యమున చూచెను. నాటికి నేటికి శరీరములో చాలా మార్పులు వచ్చినవి. అందువలన చైత్రుడు మైత్రునితో 'వాడేరా వీడు, దేవదత్తుడు' అని చెప్పెను. దీనికి సంస్కృత రూపము. 'సోయం దేవదత్తః' ఇచ్చట చిన్ననాటి లక్షణాలు గల దేవదత్తుడు నేటి పెద్దతనపు లక్షణాలు గల దేవదత్తునకు మధ్య భేదలక్షణాలు కలవు. అయినా వారు వేరు

కారు గదా! అట్లే, బ్రహ్మకు జీవునకు లక్షణ భేదమున్నను మాయవలన కనబడు భేదమే తప్ప వాస్తవ భేదము కాదు. కనుక ఆ లక్షణములను అనగా అఖండ, ఖండ, సర్వజ్ఞ అల్పజ్ఞ-' అను వానిని విడనాడి ఈ బ్రహ్మ జీవులయందుగల 'చైతన్యము' అను అంశము ఒక్కటే అని గుర్తింపవలయును. ఇట్లు గుర్తించుటకు ఆ వాక్యమున 'జహదజహల్లక్షణ' అను దానిని ఉపయోగించెదరు. జహత్=కొంతవిడిచి, అజహత్=కొంతవిడవక, లక్షణా=అర్థమును గుర్తించుట. దీనివలన '2' పదార్థములు 'చైతన్యము' అని అర్థము వచ్చును. ఇందువలన అద్వైతము సిద్ధించినది.

శ్లో॥ సర్వస్య మాయామయత్వాత్-పూర్ణత్వం పరమాత్మని
ప్రతీచో వచ్ఛిన్నతా చ-మిథ్యాస్యాన్న కథం పునః' 23

**తాత్పర్యము:-** సర్వ ప్రపంచము మాయా స్వరూపమే. అనగా మిథ్యయే. అందువలన పరమాత్మయే సర్వవ్యాపి. ఇట్టి స్థితిలో ప్రత్యగాత్మ అనగా మన దేహమునందున్నట్లు మనము భావించు 'ఆత్మ' అవచ్ఛిన్నము లేదా పరిచ్ఛిన్నము లేదా ఖండము లేదా దేహ మాత్ర పరిమితము కాదు. దేహమే 'మాయ' కనుక, లేనిదే కనుక 'సర్వము మాయ, బ్రహ్మము సర్వవ్యాపి' కనుక 'ప్రత్యగాత్మ' ఖండరూపమని దేహపు సరిహద్దులు గలదని చెప్పుట మిథ్య కాక ఎట్లుండును.

శ్లో॥ సర్వస్య మాయామయత్వం-ప్రాక్చోర్ధ్వం తదభావతః॥
జ్ఞానాదూర్ధ్వం న మాయా చే-త్యస్మాత్ దృశ్యం మృషా మృషా॥ 24

**తాత్పర్యము:-** సర్వ ప్రపంచము మాయామయము. ఎందువలన? అనగా, సృష్టికి పూర్వము ప్రళయము తరువాత ఈ ప్రపంచము లేదు. అట్లే సుషుప్తిలో లేదు. మరియు, జ్ఞానము అనగా బ్రహ్మజ్ఞానము కలిగిన తరువాత ఈ ప్రపంచము లేదు. కనుక ఇది యంతయు మాయ. దృశ్య ప్రపంచమంతయూ మాయ. దృశ్య ప్రపంచమంతయు అసత్యము. మిథ్య.

శ్లో॥ దృక్పదార్థ స్త్వేక ఏవ-సత్య స్సచ్చిత్సుఖాత్మకః,
దృశో భావం న దృగ్వేత్తి-నాన్యః సద్రూపతా రతః' 25

**తాత్పర్యము:-** దృక్, లేదా ద్రష్ట అనగా జ్ఞాన రూపుడు ఏకపదార్థమే. సత్యమే.

అయన 'సత్' రూపుడు.'చిత్' రూపుడు. సుఖరూపుడు అనగా ఆనందరూపుడు. అందు సత్ రూపుడు అనుటకు కారణము ఏమనగా .. జ్ఞానరూపుడయిన 'ఆత్మ' లేకపోవుట ఎవరికి తెలియదు అనగా 'ఆత్మ' నిశ్చయముగా ఉన్నదే. కనుక 'సత్'.

శ్లో॥ దృశ్యస్య భావాభావౌ చా-ప్యయం వేత్తీతి చిన్మయః।
ప్రియం సమస్త మాత్మార్థ-మిత్యాత్మా సుఖరూపకః॥ 26

**తాత్పర్యము:-** దృశ్యమయిన ప్రపంచము యొక్క ఉనికిని లేమిని గుర్తింపగలవాడు ఈ ప్రత్యగాత్మయే. కనుక అయన చిన్మయుడు. చిత్ అనగా జ్ఞానము. చిన్మయుడు అనగా జ్ఞానస్వరూపుడు అని అర్థము. మనకు ఏదయినను ఇష్టమగుట, ఇష్టములేకుండుట ఉండును. దీనికి కారణము ఆయా వస్తువులు మనకు పనికి వచ్చుట లేదా పనికి రాకుండుట అనునదే. మనకు మన భార్యలు ఇష్టము. ఎందువలన? వారు మనకు పనికి వచ్చెదరు కనుక. వారు ఇష్టము కాకపోవచ్చును. అట్టియెడ విడిపోయెదము. ఏదయినను ఆపద వచ్చినపుడు వారిని గుడా రక్షించెదము. కాని వారిని రక్షించుటలో మనకు గూడా ఆపద వచ్చు పక్షమున మనము వారిని వదలి మన ప్రాణములనే రక్షించుకొందుము. కారణమేమనగా మనకు 'మనమే' ఇష్టము. మనము మన 'ఆత్మ' కనుక సర్వజీవులకు ఆత్మ ప్రియమైనది కనుక ఆత్మ "ఆనంద" రూపము. కనుక ఆత్మ "సచ్చిదానంద" స్వరూపము.

శ్లో॥ అసజ్జడం దుఃఖరూపం-దృశ్యం తస్మాత్ విలక్షణే।
దృగ్దృశ్యే ద్వే తయో రైక్యమ్-స కదాచిచ్చ సంభవేత్॥ 27

**తాత్పర్యము:-** దృశ్యమయిన ప్రపంచము ఆత్మకన్న భిన్నమయినది. ఆత్మ జ్ఞానరూపము. ప్రపంచము అజ్ఞానరూపము మిథ్య, మాయ, దుఃఖరూప మయినది. "ఆత్మ" ఆనందరూపమయినది. కనుక ఈ '2' ఎప్పటికిని "ఒక్కటి" కావు.

శ్లో॥ 'గగనే నైల్యవత్ స్వాత్మ-న్యసత్ జీవేంద్రియాదికమ్।
మాయయా దృశ్య మధ్యస్తం-తస్మాన్మాయాం వినాశయేత్॥ 28

**తాత్పర్యము:-** ఆకాశము శూన్యము. రూపము లేనిది. కాని 'నీలము'గా కనబడును. కాని ఆ నీల వర్ణము వాస్తవము కాదు. అది ఎడారిలో నీరు వంటిది. అట్లే 'ఆత్మ' శుద్ధమయినది. సత్యమయినది. కాని దానియందు జీవ, ఇంద్రియ మొ ॥ ధర్మములు ఆరోపింపబడినవి. నిజమునకు ఇవి అసత్తులు. అనగా లేనివి. అంతా మాయ వలన వచ్చినవి. కనుక మాయను తొలగింప వలయును.

శ్లో॥ **అభ్రయాథాత్మ్య విజ్ఞానాత్-యథా నైల్యం సకారణమ్।**
**నశ్యేదేవం స్వయాథాత్మ్య -జ్ఞానాత్ జీవాదికమ్ సమమ్॥ 29**

**తాత్పర్యము:-** ఆకాశము నీలము అనునది మనకు ఏర్పడిన భావన. అయితే ఆకాశము యొక్క స్వరూపము మనకు తెలిసిన తర్వాత ఈ భావన భ్రాంతియని అర్థమగును, తొలగిపోవును. అట్లే 'ఆత్మ' స్వరూప జ్ఞానము అను భావములోనికి వచ్చిన తరువాత జీవ, ఇంద్రియ శరీరాది భావనలు భ్రాంతులని తెలిసి తొలగిపోవును. ఈ భ్రాంతులు, వీనికి కారణమయిన "మాయ" తొలగిపోవును.

శ్లో॥ **ఆత్మయాథాత్మ్య విజ్ఞాన-కృతే తస్మా న్నిరంతరమ్,**
**శ్రవణాదిక మాదధ్యా-దితి బ్రూతే శ్రుతి ర్హితా' 30**

**తాత్పర్యము:-** 'ఆత్మ' స్వరూపమును గుర్తించుటకు చేయవలసినది నిరంతర సాధన. అది వేదాంత శ్రవణము. విషయములను మననము చేయుట, ధ్యానము చేయుట మొ॥. వీని వలన శాస్త్ర బోధితమయిన ఆత్మ జ్ఞానము అనుభవముకు వచ్చును. అని వేదము చెప్పిన మార్గము. చూ ॥ శ్రుతి 'ఆత్మా వా అరే మైత్రేయి! ద్రష్టవ్యః శ్రోతవ్యః మన్తవ్యః నిదిధ్యాసితవ్యః'.

శ్లో॥ **నిష్ప్రపఞ్చబ్రహ్మరూపం-యాథాత్మ్యం ప్రత్యగాత్మనః।**
**తత్ జ్ఞాత్వా ముచ్యతే జన్తుః-సంసారా న్మాయికాత్ స్వయమ్॥ 31**

**తాత్పర్యము:-** దేహములోనున్న చైతన్యము ప్రత్యగాత్మ. సర్వవ్యాప్త చైతన్యము బ్రహ్మము. "ఈ ప్రత్యగాత్మయే ఆ బ్రహ్మము" అని తెలిసిన జీవుడు మాయామయ మయిన మిథ్యా సంసారము నుండి బయటపడును.

శ్లో॥ రజ్జుజ్ఞానా ద్యథా సర్ప-భ్రాంత్యా ముచ్యేత లౌకికః,
ఆత్మజ్ఞానాత్తథా జీవ -భ్రాంత్యా ముచ్యేత పండితః' 32

**తాత్పర్యము:-** త్రాడును చూచి చీకటిలో పాము అని భయపడిన వ్యక్తి దీప సహాయముతో త్రాడు అని పాము కాదని తెలిసికొని తన భయ భ్రాంతులను పోగొట్టుకొనును. అట్లే 'బ్రహ్మను' బ్రహ్మగా కాక ప్రపంచముగానో, అట్లే ఆత్మను శరీరముగానో భావించి సంసారబాధలుపడు అజ్ఞాని శాస్త్రశ్రవణాది సాధనములచే జీవభ్రాంతి, శరీర భ్రాంతి, ప్రపంచ భ్రాంతి తొలగి ఆత్మ జ్ఞానము ఏర్పడును. దానితో సంసారబంధ విముక్తి కల్గును.

శ్లో॥ అహంకార చిదాత్మానా-వేకీకృత్యా వివేకతః॥
యస్తు వ్యవహరత్యస్మీ-త్యయ మేవం వివేచయేత్॥ 33

**తాత్పర్యము:-** అహంకారమును, చిదాత్మను ఏకము చేసి తేడా లేకుండగా అవివేకముగా వ్యవహరించువాడు ఇట్లు వివేచన చేయవలెను. 'ఆత్మ' అనగా 'జీవుడే' అను భ్రాంతి ఎవరికి? జీవునకా ? ప్రత్యగాత్మకా ? జీవుని జ్ఞానము జీవునకు సంబంధించినంతవఱకు 'ప్రమ' యే అనగా జ్ఞానమే కాని భ్రమకాదు. "ప్రత్యగాత్మ"కు అసలు "భ్రాంతి"యే లేదు. ఆయన జ్ఞానస్వరూపుడు. ఇక భ్రాంతి యెక్కడిది. కాబట్టి ఎవడయితే అహంకారమును ప్రత్యగాత్మను ఏకము చేసి ఎవరు "నేను" అని అవివేకముగా వ్యవహరించుచున్నాడో ఆయన పై వివేచన చేసి మోక్షమును పొందవలయును.

శ్లో॥ అహంకారాధ్యాసవశాత్-యః సంసారాత్మతాం గతః
స ఏవాత్మవివేకేన-సచ్చిద్బ్రహ్మాత్మతాం వ్రజేత్ 34

**తాత్పర్యము:-** ఎవరయితే అహంకారము నందు చైతన్యమును అనగా జ్ఞానమును అధ్యాస (ఆరోపణ) చేసినందువలన సంసారస్వరూపుడయినాడో అతడే "తాను" నిజముగా ఎవరో తెలిసికొని "సచ్చిదానందరూప బ్రహ్మ" గా అగును. అనగా తన స్వరూపమును తాను తెలిసికొనును. కనుక జీవునకు ఆత్మనాశము లేదు. జీవునకు మోక్షము అనగా 2 విధముల అభిప్రాయములు గలవు.

1.జీవుడు పోయి బ్రహ్మములో కలియుట=మోక్షము. ఈ పక్షమున జీవుడు అను పదార్థమునకు అస్తిత్వము పోవును. కనుక మోక్షానందమును అనుభవించుటకు జీవుడే లేడు. అనగా ఈ మోక్షము 'ఆత్మహత్య' వంటిది. అనుభవించువాడే లేనపుడు ఈ రకమయిన మోక్షము పురుషార్థమెట్లగును. పురుషుడు అనుభవించినచో పురుషార్థమగును.

2. జీవుడు, తాను జీవుడుగాదని, తాను అసలు పరమాత్మనే అని తెలిసికొనుట =మోక్షము. ఈ మోక్షములో జీవుడు లేకపోవుట ఉండదు. తన వాస్తవ స్వరూపమును తెలిసికొనును.అనగా తాను బ్రహ్మమని తెలిసికొనును. తాను సచ్చిదానందమయుడని తెలిసికొనును. సర్వదుఃఖములు నశించును. సర్వ బంధములు వదలును. చూ ॥ గీత

'భిద్యతే హృదయ గ్రంథిః-ఛిద్యంతే సర్వ సంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి-తస్మిన్ దృష్టే పరావరే'

కనుక ఇందులో జీవునకు స్వస్వరూప లాభము. ఆనందస్వరూప లాభము. కనుక ఇది పురుషార్థము. ఇది మోక్షము.

శ్లో॥ 'సంసర్తుం వా విమోక్తుం వా-కేవలాహంకృతి ర్నహి
క్షమా తస్మా త్సచిత్కాహం-కారః పూరుష ఆశ్రితః' 35

తాత్పర్యము:- 'అహంకారము' అనునది ఒక జడమయిన భావము మాత్రమే. దానికి సంసారము ఉండును. మోక్షము ఉండదు. దానికి అట్టి సమర్థత లేదు. దీనియందు ప్రత్యగాత్మ యొక్క చైతన్యము ప్రతిఫలించిననే దానికి 'నేను' అను జీవ భావన వచ్చును. అట్టి అంతఃకరణ సహిత చైతన్యమే జీవుడని, పురుషుడని వేదములు చెప్పుచున్నవి.

శ్లో॥ 'ఆత్మానాత్మాధ్యాసశాలీ-ముముక్షుః పురుష స్తతః।
ఆత్మానాత్మవివేకం తు-కుర్యా న్ముక్తి ప్రసిద్ధయే॥ 36

తాత్పర్యము:- 'ఆత్మ' యందు 'అనాత్మ' అయిన శరీరాది అహంభావమును, 'అధ్యాస' అనగా ఆరోపణచేసిన జీవుడు లేదా పురుషుడు, మోక్షము కోరినచో 'ఆత్మ' ఏదో, 'అనాత్మ' అనగా మాయాకల్పితమయిన 'శరీరాదులు' ఏవో, 'వివేచన'

చేయవలయును. ఈ వివేచన వలన తాను 'అంతఃకరణము మొదలగు జడపదార్థములు కాదని వీనికి సాక్షిభూతమయి నిలచిన అఖండ జ్ఞానస్వరూప మయిన 'ఆత్మ' అని తెలియును. కనుక ముముక్షువు 'ఆత్మ-అనాత్మ' వివేకము చేసినచో తప్పక 'ముక్తి' లభించును.

**శ్లో॥ పురుషస్యాధ్యాసహానాత్-బ్రహ్మరూపేణ సంస్థితిః।**
**'ముక్తి' రిత్యుచ్యతే సేయం-నిత్యా కింతు తిరోహితా॥ 37**

**తాత్పర్యము:-** 'వేదాంతపరిభాష' లో అనగా, అద్వైత మార్గములో, ఆత్మానాత్మ వివేకముచేయుట వలన పురుషునకు అధ్యాస నశించును. 'అధ్యాస' అనగా, బ్రహ్మయందు ఆరోపింపబడిన జగత్తు అట్లే ఆత్మయందు ఆరోపింప బడిన అంతఃకరణాది శరీరభావన. ఇది మాయచే అనగా అవిద్యచే అనగా అజ్ఞానముచే ఏర్పడును. ఇది తొలగనంతవఱకు ముక్తి కలుగదు. కనుక 'మాయ' వలన ఈ అధ్యాస ఉన్నంతకాలము 'ముక్తి' మనకు తిరోహితము. అనగా దుర్లభము. 'ముక్తి' అనగా అధ్యాస నశించుట. తాను బ్రహ్మమే అని తెలియుట.

**శ్లో॥ మాయయా తత్తిరోధాన-నాశార్థం, ప్రవివేచయేత్।**
**దృశ్యా త్పుమాన్ నిజాత్మానం-ఇతి వేదాంతనిశ్చయః॥ 38**

**తాత్పర్యము:-** మాయ వలన 'ముక్తి' అనగా 'తాను బ్రహ్మమే' అని తెలిసికొనుట దుర్లభమయినది. తిరోహితమయినది. కనుక ఈ తిరోధానమును తొలగించుటకు జీవుడు చేయవలసిన పని యేమనగా, దృశ్యము నుంచి అనగా జడపదార్థమయిన యీ మాయా ప్రపంచము నుంచి 'తనను' విడదీసి కొనవలయును. అందుకొఱకు అద్వైత వేదాంతచింతన చేయవలయును. అని 'వేదాంత నిశ్చయము'.

శ్రీః

**ADVAITAMṚTAM** and
**VEDANTA NIṠCHAYAH** of
**SRI BELLAMKONDA RAMARAYA KAVI** (1875-1914)
with Telugu translation by
**Mellachervu Venkata Subrahmanya Sastri**
is published with the financial assistance of
Sri **Ravi Venkata Subbaiah & Seetaramamma** of
Vatticherukuru village of Guntur Dist.
which is placed at the lotus feet of
*Sri Bhramaramba Mallikarjuna Swamy of Srisailam*

98

శ్రీశ్రీశ్రీ జగద్గురు

శ్రీశఙ్కరాచార్య కృతాయాః **దశశ్లోక్యాః**,
శ్రీమధుసూదనసరస్వతీయతీన్ద్రేణ రచితస్య
వ్యాఖ్యారూపస్య, **సిద్ధాన్తబిన్దుః** ఇతి గ్రన్థస్య,
అపరశఙ్కరేణ శ్రీబెల్లఙ్కొణ్డరామరాయకవినా రచితా

# సిద్ధాన్తసిన్ధుః

ఇతి బృహతీ టీకా, ఏతావత్పర్యన్తం అముద్రితా,
శీఘ్రమేవ తత్ర భవత్యా రావి కృష్ణకుమార్యా
ముద్రాపితా విద్వత్కరకమలేషు సమర్పిష్యతే

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | RMRO1A101 | Date | 03/08/2022 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 97 | | |
| Missing Pages | NO | | |
| Prepared By | K.Yameema | Cutting By | K.Yameema |
| Scanned By | Prathyusha | Pages | 101 |